# సహకారంలో ఉన్న చమత్కారం

స్వయం సహాయం. పరస్పర సహకారంవలన ఎంతటి పనులయినా ఎలా అవలీలగా సాధించుకోవచ్చునో ఉత్తర ప్రదేశ్‌లోని షెహానీ గ్రామ మహిళలు ఋజువుచేశారు. తమ ఇళ్లకు చేరువగా ఒక బావి ఉంటే వీలుగా ఉంటుందని వారు ఎన్నాళ్లనుంచో అనుకుంటున్నారు. అది అంత తేలికగా సాధ్యపడేదికాదని మగవారు మాట్లాడకుండా ఊరుకున్నారు.

ఒకరికొకరు సహాయంగా కృషిచేస్తే, తప్పకుండా సాధించవచ్చునని తోచింది స్త్రీలకు. అంతే. నలుగురు స్త్రీలు నడుంకట్టి బావి త్రవ్వడం ఆరంభించారు, నమ్మండి. అరవై అడుగుల లోతుకు త్రవ్వారు. నీరు పడింది!

పొరుగు గ్రామాలవారు కూడా ఈ ఉత్సాహాన్ని ఊతగా తీసుకుని కృషిచేస్తున్నారంటే, అందులో ఆశ్చర్యమేముంది?



సహకార యత్నంవలన మనకు సర్వ సౌకర్యాలూ సమకూరడమే కాక, సంఘ సంక్షేమం కూడా సాధ్యపడుతుంది. తద్వారా దేశకల్యాణం సత్వరంగా సిద్ధిస్తుంది.

## ప్రణాళికకు సహకారమివ్వండి

## మీ మేలుకు మీరు కృషిచేయండి!

DA-59/107




జయజయ గృహలక్ష్మి స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతీమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్ :
సి. సి. పున్నయ్య



# దారిద్ర్య నిర్మూలనము — ప్రణాళికలు

దారిద్ర్యనిర్మూలనమునకు ప్రణాళికాబద్ధమైన కృషియవసరమంటుంటారు పెద్దలు. దారిద్ర్యము అంతరించినదనడానికి చిహ్నము ప్రజలదైనికావసరములు అందుబాటులోకి రావడము. అంటే తమజీవితావసరములను తమ కృషికి ప్రతిఫలంగా సేకరించుకో కలిగి చీకు చింతలేకుండా జీవయాత్ర సాగించకలిగిననాడు ప్రజలకు ఆర్థికదుస్థితినుండి విముక్తికలిగినట్లు కాగలదు. ఇందుకు తగిన వాతావరణమును ప్రజలుసృష్టించుకోడానికి ప్రణాళికలు తోడ్పడాలి.

ప్రజలు సుఖసౌభాగ్యములను చేపట్టడానికి ప్రజలలో పరస్పరసానుభూతి, సద్భావములు పెంపుకావాలి. ప్రతియొక్కరు తమతోబాటు సోదరప్రజానీకం సుఖసౌభాగ్యముల కర్తలనియు, తనమంచిచెడ్డలెట్టివో, యితరులవిసయితము అట్టివేయనివాస్తవిక పరిజ్ఞానము దృష్ట్యా గుర్తించి ఉమ్మడిశ్రేయస్సుపట్ల ఆసక్తిచూపి కృషిచేయాలి. అట్టికృషి ప్రణాళికాబద్ధమైనప్పుడు దారిద్ర్యము నిర్మూలనమగుటయేకాక కలిమిలేముల

మధ్యగల తారతమ్యము సయితము తగ్గగలదు. ప్రతియొక్కరికి శాంతిభద్రతలు సమకూరగలవు. ఇదే యీ నాటి కాంగ్రెస్ ఉద్దేశిస్తున్న సోషలిస్టువ్యవస్థ

కాంగ్రెస్ ఉద్దేశిస్తున్న సోషలిస్టు వ్యవస్థలో వ్యక్తిస్వాతంత్ర్యము అరికట్టబడుతుందనికాని, వ్యక్తిరక్షణకు లోపము వాటిల్లుననిగాని యూహించుట ఆత్మవంచన మాత్రమే. ప్రజలు జాతీయసంపదను తమ కృషికి ప్రతిఫలంగా వ్యక్తిగతలాభముల కుద్దేశించకుండా తమ నిత్యావసరాలకు వినియోగించుకొని, పరస్పరసానుభూతి సద్భావములతో కూడిన వాతావరణంలో సుస్థిరమైన శాంతి భద్రలతో జీవయాత్రసాగించడానికి అవకాశములు ఏర్పడుట వాంఛనీయంకాదనడం స్వార్థపూరితవాదమనిపించుతుంటుంది.

సోషలిస్టువ్యవస్థలో వ్యక్తిస్వాతంత్ర్యాన్ని సాంఘిక రాజకీయరంగాలలో అరికట్టబడే అవకాశాలులేవు, ఆర్థికరంగంలోనైనా ఉమ్మడిశ్రేయోపురోభివృద్ధుల నుద్దేశించి ఉమ్మడికృషి, దానికి ప్రతిఫలంగా లోటులేని నిత్యజీవితావసరాల సేకరణ వ్యక్తిస్వాతంత్ర్యము నరికట్టినట్లుకాజాలదు. మానవునిశక్తి సామర్థ్యాలు, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు సాధించవలసిన వానిలో జీవితప్రధానావసరాలు ఒకటి. అవితనయొక్కని శ్రేయస్సునుద్దేశించియే కాక సోదరప్రజానీకమును సయితము ఉద్దేశించి జరుగుట మానవుని విశాలహృదయమునకు చిహ్నముకాగలదు. వ్యక్తిగతంగా ఎవరిమంచిచెడ్డలను వారు చూచుకుంటూ సోదరప్రజానీకమును, వారికష్టసుఖాలను నిర్లక్ష్యంచేసేవారు సోషలిజంను వ్యతిరేకించడంలో విశేషములేదు. అట్టివారు తమఅధికార ఆధిపత్యములను ఆర్థికరంగములో నిలబెట్టుకొని శాశ్వతంగా కలిమిలేముల తారతమ్యమును నిలవదీయాలని ప్రయత్నిస్తుంటారు. వారికి ఉమ్మడిశ్రేయస్సుపట్ల ఆసక్తియుండదు సరిగదా - ఆర్థికదుస్థితితొలగాలనే ఆరాటముయుండదు. పైగా ప్రజల ఆర్థికదుస్థితినీ, కలిమిలేముల మధ్యగల తారతమ్యాన్ని ఆధారంగాచేసికొని మహోజ్జ్వలమైన వ్యక్తిగత సౌభాగ్యాన్ని నిర్మించుకోవాలని ప్రయత్నిస్తుంటారు. అందుకుగాను ప్రజలను కల్లబొల్లి కబుర్లతో మోసగించడానికిసయితం వెనుకాడరు. ఉమ్మడి శ్రేయస్సును, రక్షణను తమవ్యక్తిస్వాతంత్ర్య రక్షణలకు బలిచేయకోరే వ్యక్తులైనా, నాయకత్వమైనా చాల ప్రమాదకరమైనవి. అవి దారిద్ర్యనిర్మూలనమునకు ప్రణాళికాబద్ధమైన కృషిని ప్రోత్సహించవు.

——(o)——

# లఘుపరిశ్రమల స్థాపన

లఘుపరిశ్రమలను దేశవ్యాప్తంగా స్థాపించుటకు (ప్రతిరాష్ట్రం)లో కార్పొరేషన్లు ఏర్పడబోవుచున్నవి. అయితే లఘుపరిశ్రమల లక్ష్యం ఏ ప్రాంతానికాప్రాంతము

తమకుగల అవకాశములతో ప్రజావసరాలను ఉత్పత్తి చేసికొనగలుగడం కావాలి. అంతేకాక లఘుపరిశ్రమలు అనేకమంది సాంకేతిక నిపుణులను తయారుచేయడంతో పాటు ప్రజలకు పనిపాటులు కల్పించాలి.

లఘుపరిశ్రమలు, గృహపరిశ్రమలు ఉత్తమ నాణ్యస్థాయిని ఉద్దేశించి ఉత్పత్తులు జరుగాలి. లఘుపరిశ్రమలు ప్రజావసరాలను తీర్చుటకు, నాణ్యస్థాయిని పెంపుచేయ్యుటకును గృహపరిశ్రమలకు తోడ్పడాలి కాని వాటితో పోటీచేయకూడదు.

లఘుపరిశ్రమల స్థాపనకు భారీపరిశ్రమలకు వలసినంత పెద్ద పెట్టుబడులవసరం లేదు కాబట్టి ప్రజావసరాలైన ఆహార, వస్త్ర, తదితర నిత్యావసరాలు అమరుటకు లఘుపరిశ్రమలు విశేషంగా మన దేశమునకు అనువైనవి.

---

## వాలుజడ!

శ్రీమతి S. K. నిరుపమగురుకర్

వాలుజడ!
బొమ్మరసానిగడ
నాలో గడబిడ
నీ వాలుజడ!

అమ్మయ్యో సాము
జలదరించు సాము
కదల్ ఆజడ!
పువ్వు లాబిడ!

చిఱుగంటల
చిఱునగవుల
చిందులాడు
వాలుజడ!

చాచిన అగ్ని నాలుక
వొయ్యారము లొలుక
పిరుదులపై కదలిక
తడపదు నడక!

రెండాకుల పువ్వు!
నగ పిలవకయే కవ్వు!
నిడుద జడలో!
నా హృదయంలో!

వాలుజడ!
అందముల తేడ!
అందరిలో కూడ!
వాలుజడ!





సాహిత్య జగత్తు :

# అభ్యుదయ సాహిత్యం

శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి



అజ్ఞానమనే తెరల్ని చీల్చుకొని విజ్ఞానం వాద వాదలా విస్తరించి మానవునిలో నిద్రాణమైన శక్తిని జాగృతమొనర్చి మానవ ప్రకృతినే మార్చివేస్తూ, ప్రపంచాన్ని అడుగడుక్కూ అభ్యుదయ పథంలోనికి తీసుకెళ్తున్న కొద్దీ యీ బ్రహ్మాండవిశ్వంలో అనేక మార్పులు మనం చూస్తున్నాము. ఈ పురోగమనం ఏ ఆర్థిక రాజకీయరంగాలలో పరిమితం కాకుండా, సాంఘిక వైజ్ఞానిక రంగాలలోను - సర్వత్రా మనకు గోచరిస్తుంది. ఈ పరిణామం విశ్వవ్యాప్తమైంది. రాతియుగంనుంచీ అణుయుగంలోనికి ప్రవేశించడానికి ఎంతకాలం పట్టింది - యీలోగా ఎంత పరిశోధన జరిగిందీ కూలంకషంగా చర్చించాలంటే ఎవరి వల్లనూ కాదు. అలా ఒక్కొక్క రంగంలో వచ్చిన పరిణామాలను చెప్పుకుంటూపోతే దానికి అంతే వుండదు. మానవ విజ్ఞానాన్ని కొలిచేందుకు మన దగ్గరున్న అడుగుబద్దలు చాలవు! కొండను కావలించుకోవడం ఎవరితరం మరి?

సాహిత్యమును గూర్చిన చర్చకూడా అలాంటి గడ్డు సమస్యల్లో ఒకటి. సాహిత్యం సాగరం వంటిది. దాన్నిగూర్చి సమగ్రంగా తెలుసుకోవడంవరకే మనం చెయ్యగలపని.

సాహిత్య ప్రపంచంలో ముఖ్యంగా తెనుగు సాహిత్యానికి ఒక సముచితస్థానం వుందనే విషయం తెలియనివారు లేరు. పాశ్చాత్యులే దీన్ని "Italian cf the east" అని శ్లాఘించడంలో మనభాషకువున్న ఔన్నత్యము, విశిష్టత వ్యక్తమౌతుంది. ఎందరి హృదయాలనో దోచుకున్న సాహిత్యం నిజంగా ఒక అమృతస్రవంతే అనవచ్చు. దాన్ని కడుపార జుర్రుకొన్నవానికి ఆకలివెయ్యదు. ఆ సుధాపానంతోనే అతడు అమరుడై పోతాడు! ఇంతటి మహాత్మ్యం మనభాషలో ఎక్కడుంది? భాషలోనా భావంలోనా?- రెండూ మన సాహిత్యంలో మిళితమై వున్నాయి.

ఉత్తమసాహిత్యం అనిపించుకొనేందుకు యివి రెండూ కావలసినవే! వీటిలో ఏ ఒక్కటి లోపించినా దానిలోని మార్దవం వైశిష్ట్యము నశిస్తాయి. ఇంకా లోతుకు వెళ్లి చెప్పాలంటే యీ రెండింటిలోను భావానికే అగ్రతాంబూలం. భాష భావంకోసం పుద్భవించిందేకాని, భావం భాషకోసం పుట్టలేదు. అలాగని భావం భాషను త్రోసిపుచ్చి రాజనలేదు. రెండూ పరస్పరాశ్రయాలు. భావానికి భాషకున్న సంబంధం ఆత్మకు శరీరానికి వున్న సంబంధం వంటిది. ఉదాత్తమైన భావ (ఉచితరీతి) లో వెల్లడించినపుడే భావంయొక్క వుదాత్తత బయటపడుతుంది. అంటే ఉదాత్తమైన భావాన్ని అపసవ్యమైన భాషలో వెల్లడిస్తే భావం తేటపడకుండటమే కాక అనేక చిక్కులకు దారితీస్తుందని నా వుద్దేశ్యం. తేలికైనా భాషలో వ్రాసినా అందులో మార్దవానికేలోటూ రానీకుండా వుండాలి. అలా అని సామాన్యుల కర్థంకాని ఇనుప భాషను ప్రయోగించి మార్దవం పేరుతో పాండిత్య ప్రకర్ష ప్రదర్శించడంలో అర్థంలేదు. ఆ వ్రాసేదేమిటో చదివేవారికి చక్కగా బోధపడాలి. వారి వుత్సాహాన్ని రేకెత్తించేలా వుండాలి. పదాలు సున్నితంగా, సునిశితంగా, సందర్భోచితంగా వుండాలి, అది పద్యకావ్యం కానివ్వండి, నాటకం కానివ్వండి. కథ, వ్యాసం, గల్పిక మరేదైనా కానివ్వండి రసాత్మకంగా, వుత్సాహజనకంగా వుంటేనే అది మధుర కవిత్వం, అదే భావకవిత్వం.

'భావకవిత్వం' అనే పదం యీ రోజుల్లో సర్వజనసామాన్యమై పోయింది. ఈమాట వింటూనే కవులూ, రచయితలూ ముందుకువస్తారు మాది 'భావకవిత్వం' అని. అంతేకాదు "అభ్యుదయకవిత్వ"మంటారు. ఇక సనాతనులు అంత వెనుకగా ముందుకు రాకపోయినా దూరాన్నుంచే దుద్దుకర్రలు ముందుకుసాచి "ఖబడ్దార్! మేం వున్నాం జాగ్రత్త. మా కవిత్వం ముందు .దమ్మిడీకి పని

కొత్తుంటా మీ కవిత్వం?" అని గర్జిస్తారు. ఎవరి కవిత్వం మంచిది? ఎవరిది చెత్త? ప్రజలు దేనిని స్వీకరించాలి?

పూర్వపు కవిత్వంలో యీకాలపు ప్రజలకు మార్గదర్శకమైన భావాలు లేవనిగాని, యీకాలపు (భావ) కవిత్వంలో అంతా భావమే వుందనిగానీ నిర్ధారించలేము. రెండింటిల్లోను చెడుగు - మంచీ వున్నాయి. కేవలం పదాడంబరంతో కవిత్వం సాగిపోయిన భావశూన్యమైన గ్రంథాలు పూర్వమందునూ - భావకవిత్వం పేరుబడే భావరహితమైన చెత్తసరుకు వర్తమానంలోను లేకపోలేదు. కాని ఏ ఏ గ్రంథాల్లో ఎంతమంచి వుందో దాన్ని పరిగ్రహించి రెండింటినీ సమన్వయించుకొని మనస్సులో జీర్ణింపజేసుకోవడం ప్రజల కర్తవ్యం.

ఉత్తమసాహిత్యం:- దీనినే ఆధునిక రచయితలందరూ కొంచెం ఎక్కువ మోతాదులో "అభ్యుదయ సాహిత్యం" అని పిలుస్తారు. అభ్యుదయాన్ని వాంఛిస్తూ తదనుసారం కలాలుసాగించే కవనం యిది. కాని అదేం పాపమోగాని కొందరు రచయితల ధోరణిబట్టి చూస్తే దీనికన్న అర్థమే వేరేమో అనిపిస్తుంది. ప్రాచీనకవితారీతిని ఖండించివ్రాసే ప్రతీదీ అభ్యుదయమనే పేరుతో చలామణి అవుతోంది. ప్రాచీనకవిత్వంలో ముఖ్యంగా పద్యకవిత్వంలోవున్న యతి గణ ప్రాస నియమాలను ధిక్కరించినంత మాత్రాన మనది అభ్యుదయ కవిత్వమా? అక్కడ కావాల్సింది భావప్రధానం కాదా?

ఏమైతేనేం - ఛందస్సు భావప్రవాహానికొక ఆనకట్ట అంటారు కొందరు యువరచయితలు. నిజమే కావచ్చు. అలా అయితే ఆమార్గం అనుసరించకండి. వాళ్లకు యిష్టమైన మార్గాన్నే అవలంబించడంలోతప్పలేదు. గద్యమో పద్యమో వాళ్లేమి వ్రాసినా శ్రావ్యపద భూయిష్ఠంగా, భావసహితంగా వుంటే చాలు. అంతకన్న కావలసిన సాహిత్యప్రయోజన మేమీలేదు.

ఇలాచెప్పి వూర్కొంటే చాలదు. మరొక్క విషయం మనవి చేయాల్సివుంది. రచయితలేవి రాసినా — అవి నాటకాలు కానివ్వండి, పద్యాలు, గేయాలు కానివ్వండి లేక విమర్శనాగ్రంథాలు కానివ్వండి - ప్రజలకు కావలసినవి సాహిత్యశాఖలు, వాటి వుపశాఖలు, వాటి తీరుతెన్నులు కానేకాదు. ఆ శాఖలగుండా వాళ్లకు వచ్చే జ్ఞానసంపద వాళ్లకు కావలసింది. వాళ్లు వాంఛించేది అదే. సాహిత్యపు గమ్యం యిదికాక మరేమిటి?

ప్రాచీన సాహిత్యరీతుల్ని అధిగమించి వర్తమానంలో అనేకశాఖలు తలెత్తాయి. కాలపరిస్థితుల దృష్ట్యా యీ శాఖలు ఎంతైనా ఆవశ్యకములే.

ప్రాచీనకాలంలో ప్రసిద్ధిగన్న వేద, పురాణ ప్రబంధ కావ్యాలు యిత్యాది సాహిత్యశాఖల స్థానాన్ని యీనాడు నవలలు, నాటకాలు కథానికలు, గేయాలు మొదలైనవి ఆక్రమించుకొన్నాయి. విశేషించి పత్రికలు ఎంతో కృషి చేస్తున్నాయి. ప్రాచీనులు ఏండ్లతరబడి కృషిచేసి సామాన్యప్రజల్లో కల్గించలేని మానసిక పరిణామాన్ని, పంచలక్షాన్ని యివి కల్గించాయని చెప్పటం సాహసం కాదనుకొంటాను. ఈభావ విప్లవమే అభ్యున్నతికి సోపానము.

ఇక అభ్యుదయ సాహిత్యమంటే ఏమిటి? — అభ్యుదయ సాహిత్యానికి అనేకులు అనేక నిర్వచనాలిచ్చారు. కవిత్వానికి ఏ వేవో కొన్నినియమాలు విధించి, గీట్లు గీచి, పరిధులేర్పరచారు. కొన్ని ప్రమాణాలను నెలకొల్పారు. కాని ఎవరూ యిది యిలాగే వుండాలని మరొకవిధంగా వుండరాదని శాసించలేకపోయారు. అలా శాసించడం దుర్లభం కూడాను. కాలప్రవాహాన్ని ఆధారంచేసుకొని సాహిత్యం పయనిస్తూ వుంటుంది. దాన్ని ఎవరూ అరికట్టలేరు. సాహిత్యం జడపదార్థం కాదు. పరిణామ శీలమైంది. దీనిమీద కాలప్రభావం బలీయమైంది. ఎప్పటికప్పుడు కాలంలో వచ్చే మార్పుల్ని చేర్పుల్ని తనలో యిముడ్చుకొంటూ సాగరగాంభీర్యం దాల్చి ముందుకు పోతూవుంటుంది. అలా కాక "విన్నన్న చెప్పిందే వేదం" మనుకొంటూ పాత అంతా గొప్పదని, కొత్త పనికిరాదని "క్రొత్త"ను దూషించి దూరంగా అట్టిపెట్టాలనే మూర్ఖసిద్ధాంతం సాహిత్యానికి అన్వయించదు. "పాతక్రొత్తల మేలు కలయిక" సాహిత్యపురోభివృద్ధికి బలమైన కీలకం. దీన్ని కాదని ఏటికెదురీదడం నేలవిడిచి సాముచెయ్యడం వంటిదే కాగలదు.

అభ్యుదయ సాహిత్యానికి ఒక నిర్ణీతమైన ఆకృతి లేదుగాని 'భిన్నత్వంలో ఏకత్వం' లాగా దాని లక్ష్యంమాత్రం సర్వత్రా ఒకటే — నైతిక విలువలకు అత్యంత సన్నిహితంగా వుండటమే ఆ లక్ష్యం.

ఈనాటి అనేకరచయితలు అనుకొనేవిధంగా - హత్యలూ, రక్తపాతాలు, ఆకలిడొక్కల్ని గూర్చి వర్ణించేదల్లా అభ్యుదయ సాహిత్యం కాదు. అది కేవలం ఆకలికవిత్వం. స్వార్థాన్ని ప్రజలకు బోధించే సాహిత్యం అది. ధనికుల దౌష్ట్యాలను నిందిస్తూ వ్రాసినంతమాత్రాన అభ్యుదయం వూడిపడదు. అది ప్రజల్లో క్రోధాగ్నిని రగుల్కొల్పుతుంది. ద్వేషాన్ని జనింపజేసి ప్రజల్ని పశుతుల్యులను చేస్తుంది. ఇక పోతే విరహగేయాల్లో, ప్రణయగీతాల్లో, రాజకీయ దబ్బావాయింపులలో అభ్యుదయం కనుపించదు. తాత్కాలికోద్రేకాలకు మానవుల్ని పురికొల్పే వినాశక శక్తుల్ని సృష్టించే రాక్షసకవిత్వంలో దివిటీపెట్టి గాలించినా అభ్యుదయపు ఛాయలు కనిపించవు.

ప్రజల్లో దుర్బలత్వాన్ని, జడత్వాన్ని పోగొట్టి వారికి మనోవికాసం, శక్తిసామర్థ్యాలు, ధైర్యోత్సాహాలు ప్రసాదించే సాహిత్యం అభ్యుదయ సాహిత్యం. వారిలో "బ్రహ్మజెముడులా పెరిగిన అజ్ఞానాన్ని" సంకుచితత్వాన్ని రూపుమాపి, వారిలో జ్ఞానజ్యోతిని వెలిగించి, విశాలదృక్పథాన్ని, సద్భావాన్ని, సత్శీలాన్ని అలవాటు పడజేసి నైతికప్రవృత్తిని యినుమడింపజేసే కవిత్వమే అభ్యుదయ కవిత్వం - అభ్యుదయ సాహిత్యం!

—(०)—

# భగవజ్జిగీష

శ్రీ చదలవాడ సోదరీ కవయిత్రులు



చంద్రలోకమ్ములోఁ బ్రవేశమ్ము నొందు
రాకెటు లొనర్చుకతన గర్వమ్ముఁ జెంది
మన్ను మిన్నేక మొనగూర్చు పన్నుగడలఁ
బన్నుచుందువు; సఫలతఁ బడయఁగలవె ?

జనన మరణమ్ము లొందవని సాధనములు
గ్రాహ్య మగు పరిజ్ఞానమ్ము గలుగు నపుడె
చంద్ర-సూర్య మండల నివాసమ్ము గలుగు
వలదు ముమ్మాటికిని భగవజ్జిగీష

నిర్వికార పరబ్రహ్మ నియమమునను
జెలఁగు సృష్టి స్థితి లయమ్ము లలవిగావు
స్వల్ప జీవితమున వృథాశ్రమ మదేల ?
ఆత్మ తత్త్వానుభూతుండ వగుము సతము



శ్రీ సాయిబాబా భక్త సమాజం (రిజిష్టర్డు)

షెణాయినగరు, మదరాసు — 30.

# శ్రీ సాయినాథుని మహాసమాధి వార్షికోత్సవ సందర్భమున

## స్వామి కేశవయ్యాజీ సందేశము

"అనిత్యత్వము నుండి నిత్యత్వమునకును, అజ్ఞానాంధకారమునుండి జ్ఞానజ్యోతికిని, మృత్యువశమునుండి అమరత్వమునకును నన్ గొనిపొమ్ము"

దాదాపు 41 సంవత్సరములకు పూర్వము విజయదశమి రోజున షిర్డీనిలయుడైన శ్రీ సాయిబాబా మహాసమాధి జెందెను. 1918వ సంవత్సరము అక్టోబరు 15వ తారీఖున ఈ మహామహుడు తన మానవ దేహమును త్యజించెను. మృత్యువు అనగా జడ ప్రకృతినుండి తప్పించుకొనుటయే. గొప్పసిద్ధులకు మృత్యువు అనునది భౌతిక శృంఖలములనుండి విడివడి ఆధ్యాత్మిక ప్రపంచమున నిశ్శంకతో ఎక్కువ పరిశ్రమ చేయుటయే. శ్రీ సాయిబాబా జీవించియుండగా ఒకప్పుడిట్లు చెప్పియుండెను. "నా మహాసమాధి అనంతరము మీరు ఎచ్చట ఏక్షణమున నన్ను దలంచెదరో నేను అచ్చట ఆక్షణమున మీతోడనేయుందును." మహాసిద్ధుల సాంవత్సరికోత్సవము లన్నియు మనకు జ్ఞాపకచిహ్నములై యున్నవి. శ్రీ సాయిబాబావంటి మహాసిద్ధులు ఈపురాతన దేశమునందు జన్మించుట చేతనే దీనికి "పుణ్యభూమి" యని పేరు వచ్చెను. వారి జీవితములు "మన మెల్లపుడును మనజీవితములనుకూడ వారివలె సర్వోత్కృష్టములుగ జేసికొన గలుగుదుము." అను విషయమును నిరంతరము జ్ఞాపకముచేయుచుండును. ఒకవ్యక్తి ఏస్థితిని పొందియుండునో మరియొక వ్యక్తి గూడ కృషిచేసినచో అట్టి స్థితిని పొందగలడు.

సిద్ధులు మూడు విధములుగనున్నారు. కొందఱు చిరకాలము కష్టించి ఆత్మశిక్షణమువలన సిద్ధులగుచున్నారు. మరికొందరు ఆ ఉచ్ఛస్థితిని గుర్వనుగ్రహమున పొందుచున్నారు. వీరు కృపాసిద్ధులు. తదితరులు పుట్టుకతోడనే సిద్ధులగుచున్నారు. వీరు నిత్యసిద్ధులు. శ్రీ సాయిబాబా నిత్యసిద్ధుడు. ఈయనజీవితములో గొప్ప మతబోధలు మూర్తీభవించినవి. ఈ బోధలన్నియు ఈయన జీవితమున కార్యరూపముగా ఘనీభవించినవి. వీరి అప్రతిమానమైన పరిశుద్ధత, కనికరముతోకూడిన ప్రేమ, భూతదయ, దృఢనిశ్చయము, తీవ్రమైన శక్తి తన భక్తులనందరను స్వాధీనము చేసుకొనగలిగెను. ఇట్టి సుగుణసంపత్తి, పుష్పములయందలి అమృతము తేనెటీగల నాకర్షించునట్లు భక్తులను దేశదేశాంతరములనుండి ఆకర్షించగల్గెను.

శ్రీ బాబా గొప్పయోగపురుషుడు. ఈయన యెల్లప్పుడును ధ్యాననిష్ఠుడైయుండును. ఈయన జీవితము కర్మ, భక్తి, జ్ఞానయోగముల సమిష్టియే. శ్రీ బాబా సామాన్యదృష్టికి అజ్ఞానునివలె దోచినను, వేదములయందుగాని, ఖురానునందుగాని, వీరికి అఖండపాండిత్యముగలదు. వీరు తన భక్తులకు యీ మత సిద్ధాంతములను గొప్పవిశేషములతో బోధించుచుండెడివారు. వారి భక్తులు చాలమంది, వీరు "ధౌతి"నిచేయుచూ అంతరవయవములను అసాధారణముగా పరిశుద్ధి చేయుటను స్వయముగా చూచియున్నారు, కొందరు వీరి యఖండయోగాభ్యాసమును చూచియున్నారు. వీరి వివిధ శరీరభాగమును మశీదునందు వేర్వేరు స్థలముల

యందుండుటనుగూడా కొంతమంది గమనించియున్నారు. ఒక భక్తుడు శ్రీ సాయి బాబా ఘోరహత్యగావింపబడెనని ఆ స్థలమునుండి శీఘ్రముగా వెడలెను. కాని వెంటనే పరిశుద్ధమైన పురుషుడుగా బాబా కనుపడగా మిక్కిలి ఆశ్చర్యపడెను. (ఇది సాయి సచ్చరిత్రలోనిది) శ్రీ బాబా మొదట వైద్యమభ్యసించినను, తర్వాత దానినివదలి రోగులను "ఊధి"తో నయము చేయుచుండెను. "ఊధి" అనగా మసీదునందలి నిత్యాగ్నిహోత్రమునుండి వెడలు పవిత్రభస్మము. ఈవిధముగా శ్రీ బాబా అసంఖ్యాకులగు బీదవారి కష్టముల దీర్చియుండెను. కాని ఒక్కొక్క సమయమున తన్నాశ్రయించు వారి బాధలను తానే గ్రహించి చాల రోజులు వానితో బాధపడుచుండెడివారు.

శ్రీ బాబా సర్వమతోద్ధరణవాది. ముఖ్యముగా హిందూ మహమ్మదీయ సమ్మేళనకర్త. (ఇదియే ఈ కాలమునకు అవసరము) వీరు మసీదులందును, దేవాలయములయందును, ఎడనెడయుండెడి వారు. వీరు తమ సమక్షమునందు భగవద్గీతను గాని, రామాయణమును గాని, ఖురానును గాని మిక్కిలి బిగ్గరగా చదువ ప్రోత్సహించెడివారు. వీరి భక్తులలో అన్ని మతములనుండి వచ్చినవారుగలరు. ప్రపంచకమునందు నేడు పరస్పరమతద్వేషములున్నా షిర్డీవద్ద హిందువులు, మహమ్మదీయులు, ఒకరి ప్రక్కనొకరు శ్రీ సాయిబాబాను అవతారపురుషునిగా పూజించుచున్నారు. శ్రీ బాబా విశ్వమానవ సోదరత్వమునకును, సర్వ భూతదయకును, ఉదాహరణ పురుషుడై యొప్పెను.

ఈ సందర్భమున ఆమహానుభావుని బోధనలను జ్ఞాపకము తెచ్చుకొని, ఆ సత్యములను కార్యరూపమున పెట్టుటకు యత్నించుట లాభకారియై యున్నది. శ్రీ బాబా యెల్లపుడును "సిద్ధులయొక్క జీవితము, వారి నాశ్రయించినవారికి ఇహపరసాధకములు నొనగూర్చుటయే" యని కంఠోక్తిగా నుడివియున్నారు. నేడును శ్రీ బాబా మన ప్రార్థనలనువినుచు భౌతిక శరీరమును విడిచినను, మన మధ్యనున్నప్పటివలెనే హృదయపూర్వకముగా మన కోరికలను సిద్ధింప చేయుచున్నారు.

దయాధర్మ సత్యశౌచాది నియమములను, అసూయ, అలసత్వాది దుర్గుణ విసర్జనయు, తృప్తికలిగి భగవద్భక్తి నొనర్చుకొనుటయు బాబాగారి బోధనలో ముఖ్యాంశములు.

ఈ పవిత్ర దినమున శ్రీ సాయి భక్తులకు ప్రజాబాహుళ్యమునకు, నేజేయు విన్నపమేమనగా, మతద్వేషములను విడనాడి, అందరిని సమానముగా జూచుకొనుచు, ద్వేష, వంచనాసత్యములనువదలి, ప్రేమ సత్య విశ్వాసములతో మత సమ్మేళనముకై, శ్రీ సాయిబాబా, శరీరధారియై యుండగా ప్రయత్నించినట్లు హృదయపూర్వకముగా ప్రయత్నింపుడని మిమ్ములను పలుమరు వేడుచున్నాను.

ఓం. శాంతి. శాంతి. శాంతి.



# కండ్లకు సూర్యకాంతి చికిత్స

మూలము :

"అవతార్"

శ్రీ శివానంద భగవాన్

అనువాదము :

"శివానంద పాదసేవక్"

శ్రీ స్వామి శ్రీసివాసానంద సరస్వతి

సూర్యనారాయణ ప్రభువు ప్రత్యక్షభగవానుడు. నేత్రములకు దేవత, విరాట్పురుషునియొక్క చక్షువు, శక్తి, బలముల ప్రదాతయగు భాస్కరభగవానుని కారాధనలు.

సూర్యుడుత్సాహము, శక్తి, బలములకు మూలపుటూట (fountain-source). కండ్లకధిష్టానదేవత సూర్యుడు. భౌతికసూర్యుని వెనుక నొకదేవత, చైతన్యము లేక పురుషుడు గలడు. సూర్యుడు విరాట్పురుషునియొక్క నేత్రము. సూర్యుడు లేనిచో యావత్తు ప్రపంచము నాశమగును.

సూర్యునికిరణము లత్యుత్తమ, అతిమిక్కిలి శీఘ్ర క్రిమినాశిని (germicide). సర్వాంశముల ప్రప్రథమ, దైవిక, ఆధ్యాత్మికశక్తికి సూర్యుడు వుత్పత్తిస్థానము. సూర్యుడు గాయత్రీ యుపాసనతో సంబంధించియుండెను. సూర్యకాంతి కంటిచూపు (eye-sight) పెంపొందించి సర్వవిధములగు కంటిదోషముల తొలగించును.

ఎండలో కాచుకొను (bask) డు. మీ కండ్లు మూసుకొనుడు. నెమ్మదిగ మీతల నొకింత స్వల్పకాలమొకవైపునుండి వేరొక వైపునకు కదల్పుడు. మీ మూసిన కండ్లరెప్పలపై 10 నుండి 30 నిమిషములవరకు సూటిగ (తిన్నగ) సూర్యుని ప్రకాశింపనిండు. కన్నుగోళముల (eye-balls) కూడ తలకు వలెనే నదేదిక్కు (direction) గ కదల్చుడు (త్రిప్పుడు.).

ఇప్పుడు సూర్యునివైపు వీపు త్రిప్పుడు లేదా నీడలోనికి రండు. మీకండ్లు తెరవకుడు. మీ కండ్లను 5 నుండి 10 నిమిషములవరకు మీ చేతుల అరచేతుల (palms) తో కప్పియుంచుడు. కనుగుడ్లపై నొత్తిడి (pressure) మానుడు. ఇదియే హస్తతల క్రియ (palming).

సూర్య (ఎండ) చికిత్స నుదయమేడు గంటలకు (7 A.M.) సాయంత్ర మైదు గంటలకు (5 P.M.) పొందుడు. సూర్యునిపట్ల నేత్రవిస్ఫారణ (తెరచుట) (exposure) క్రమాభివృద్ధిగ (gradual) నుంచుడు. కండ్లు ప్రకాశమున కలవాటు బడినపుడు మీరు క్రమక్రమముగ ప్రబలమగు కాంతిని గలిగియుండగలరు.

చికిత్సాసమయమున సూర్యదేవుని ద్వాదశ (12) నామముల తిరిగి తిరిగి జపింపుడు. అవి 1 ఓం మిత్రాయనమః 2 ఓం రవయేనమః 3 ఓం సూర్యాయనమః 4 ఓం భానవేనమః 5 ఓం ఖగాయనమః 6 ఓం పూష్ణేనమః 7 ఓం హిరణ్యగర్భాయనమః 8 ఓం మరీచయేనమః 9 ఓం ఆదిత్యాయనమః 10 ఓం సవిత్రేనమః 11 ఓం అర్కాయనమః 12 ఓం భాస్కరాయనమః అయియున్నవి.

హ్రస్వదృష్టి (short sightedness) గ్రుడ్డితనము, కంటికురుపులు (ulcers), కనుగ్రుడ్డు పటల ప్రకాశఅంధనము (corneal opacity), కండ్లకలక (conjuctivitis) కనుద్రవప్రసారపుటడ్డంకు (iritis), కనుగ్రుడ్డు పెద్దదగుట (cejlancoma), నేత్రదృష్టిబలహీనత, కంటికసువు (cataract), కనుగ్రుడ్డు (eyeball) గట్టితనము లేక మృదుత్వము, కంటియొకపులు (ophthalmia), కంటికొనలదురద (blepharites marginalis) రేచీకటి లేక నిశాదృష్టిలోపము (night blindness or nyctolopia) నింకను కండ్ల సమస్తవ్యాధులు నయమగును.

మీరా పరాత్పరుని పండ్రెండు (12) నామముల స్మరింతురు గాన కండ్ల ఆరోగ్యమునకగు నభ్యాసముతోబాటు సూర్యారాధన లేక సూర్యోపాసనయు గలదు. జీవితములోకూడ మీరు జయము నొందుదురు. మీరు సుందరమగు నారోగ్యము, దీర్ఘాయువు గల్గియుందురు. మీ శత్రువులందరు మడమల గైకొందురు (పరుగిడెదరు). శ్రీరామప్రభువు సూర్యోపాసన ద్వారనే రావణుని చంపెను.

పైపద్ధతి నభ్యసించి కంటిదృష్టిని పెంపొందించుకొని మీ కండ్లద్దముల (సులోచనముల) చెత్తడబ్బా (dustbin) లో పారవేయుడు. కంటినిపుణుని వద్దకు జనకుడు. వైద్యుల ఖర్చుల పొదుపుచేయుడు. బీదల సేవించుటలో నా సొమ్మును వినియోగపర్చుడు. ఈ సూర్యచికిత్స ద్వారా వేలకొలది ప్రయోజనమందిరి.

శ్రీ సూర్యనారాయణ భగవానుడు మీకుత్తమారోగ్యము, దీర్ఘాయుస్సు, బలము, శక్తి ప్రసాదించుగాక! ఆ పరాత్పరుడు మీకు శక్తివంతమగు కంటిదృష్టి నొసగుగాక! ఆ ప్రభువు సర్వవేళల మీ నేత్రముల సంరక్షించుగాక! ఆయన మిమ్ముల జ్ఞానముయొక్క అంతర్యచక్షువు నుపయోగించునట్లాదేశించి స్మృతికిరాని యనాదికాలమునుండి మీరు వాడుచున్న నీ భౌతికచక్షువులకు విశ్రాంతి నిచ్చుగాక!

హరిః ఓమ్‌తత్సత్ !

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోని డిసయింట్-ఎక్సుపెరీ

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ



## కథా పరిచయం

[రాజకుమార్ మరో గ్రహమండలానికి సంబంధించిన అబ్బాయి. లోకాలని ఒక సారి చుట్టి రావాలనే వుబలాటంతో కొన్ని గ్రహమండలాలకేసి వెళ్లి అక్కడి అద్భుతాలని చూసి ఇప్పుడు భూలోకంలోకి అడుగెట్టాడు. అబ్బాయి ప్రప్రథమంలో చూసిన దృశ్యం నిర్మానుష్యమైన కొండ పరిసరాలలో. అది వాడికి నచ్చింది కాదు. తను ఒంటరిగాడ్ని అని తనకి స్నేహితులు కావాలని అరిచాడు. ఆ ధ్వనికి అదే ప్రతిధ్వనిగా వినబడటం తప్ప మరే సహాయం లభించింది కాదు. అక్కడినుంచి తిన్నగా పీఠభూమిలో నడుస్తూవున్న సమయంలో రోజా మొక్కలు దోవలో కనబడ్డాయి. అవి వాడిదగ్గరనున్న పువ్వుకి మల్లె వుండటం చూస్తూ ఆశ్చర్యపడుతూ, తన దానికీ, వీటికీ ఏంతేడా కనబడనందుకు ఒక పెద్ద పెట్టున ఏడ్వసాగాడు. ఆ సమయంలోనే అబ్బాయి దుఃఖాన్ని పసికట్టుతూ ఒక నక్కవాడిని ఆప్యాయంగా పలకరించింది. తన గొడవని దానికి చెప్పుతూ దానిని తన దగ్గరికి రమ్మని కోరాడు. మనుషులు తనని మచ్చిక చేసుకుంటేనేగాని తను అబ్బాయి దగ్గరికి రావటానికి సులభంకాదని అన్నది. ఇక చదవండి ...]

"ఊఁ! ఇప్పుడు అర్థం అవుతున్నది మచ్చిక చేయుటమంటే ఏమిటో .... ఒక పువ్వువుంది ... దాన్ని నేను మచ్చిక చేసుకున్నానని అనుకుంటాను,..."

"అలా అవటానికి సాధ్యమే! ఈ భూమిలో మనిషి ఎన్నెన్నిటినో చూస్తూ వుంటాడు. వాటిని చప్పునలాక్కొని తనపని కోసం వాడుకుంటాడు...."

దాని మాటకి అడ్డువస్తూ "ఓ నా పువ్వు ఈ భూమికి సంబంధించింది కాదే!" అని అన్నాడు రాజకుమార్.

ఆ మాటతో నక్కకి ఆశ్చర్యంవేసి "అంటే మరో గ్రహమండలాన్నుంచి వచ్చావా?" అని ఆవేశంతో అడిగింది.

"ఆ!"

"అక్కడ వేటగాండ్రు వుంటారా?"

"ఊహూ!" అని తల అడ్డంతిప్పుతూ జవాబిచ్చాడు అబ్బాయి.

"ఆశ్చర్యంగావుందే! వాళ్లు లేకపోతే కోళ్లయినా వుంటాయా?"

"కోళ్లులేవు" అని అన్నాడు.

"అంటే నీ గ్రహమండలపు సృష్టిలో కొంత కొంత వున్నదన్నమాట ... " అని ఏదో అనబోతూ కొంచెం సేపు ఆగిపోయింది నక్క. ఆ సమయంలో అమాంతంగా దానికి ఏం తట్టిందో "నా జీవితమంతా యంత్రం మల్లె అయిపోయింది. కోళ్లని వేటాడటం నాకు సరదా. నన్ను వేటాడటం మనుషులకి సరదా. అంచేత రాత్రింబగళ్లూ వాళ్లకేసి వెయ్యి కళ్లతోచూస్తూ వెయ్యి చెవులతో వింటూ నా జీవితాన్ని గడపుకోటం అలవాటయిపోయింది. నువ్వే

నన్ను మచ్చిక చేసుకుంటివా, నీ అలవాట్లన్నీ నాకు అర్థమవుతాయి. అంతెందుకు నీ అడుగుచప్పుళ్లని ఎంత దూరాన్నుంచి అయినా ఇతర్ల చప్పుల్లనుంచి పసికట్టేశక్తి నాకు ఉంటుంది, ఇతర్లు నాకేసి రావటమంటే నన్ను వేటాడాలనే! నువ్వయితేనా, నాదగ్గరికి రావటం నాతో ఆటపాటలతో హాయిగా కాలక్షేపంచేయటానికే అన్న సంగతి అతిసులభంగా తెలుసుకోగలుగుతాను. ... అటుకేసిచూడు! ఆ పొలాల్లో గోధుమలు పండుతాయి. వాటిని తినటం నాకు అలవాటులేదు. అంచేత ఆ గోధుమలు నాకు నిష్ప్రయోజనం. నా దృష్టి అటుకేసి సుతరామూ పోదుకూడా! నీ వెంట్రుకలు గోధుమ రంగుకి మల్లె వున్నాయి ... నువ్వే నన్ను మచ్చిక చేసుకున్నావా, నాధ్యాసంతా గోధుమ పొలాలలో తళతళ మెరుస్తూవుండే బంగారురంగు మీదే వుంటుందిగా! గాలికి గోధుమ కంకులు కదులుతూవుంటే నిన్ను తలుస్తూ వుండక ఎలావుండగలుగుతాను నువ్వే చెప్పు?'' అని మందహాసంచేస్తూ అన్నది.

కొంచెం సేపు నిశ్శబ్దంగా వుంది కాని దాని దృష్టి అంతా రాజకుమార్ మీదే! ''ఇదిగో అబ్బాయి! నన్ను నువ్వు మచ్చిక చేసుకోవూ!'' అని ప్రాధేయపడ్డది నక్క.

''నాకూ ఇష్టమే. కాని ఆ పనికోసం వ్యవధివుంటేగా - బోలెడుపనివుంది. స్నేహితులని చూసుకోవాలి. ఇక్కడవున్నవాటిని అర్థంచేసుకోవాలి ...''

''అదంతా వృథాప్రయాసం. ఇక్కడ మనుషులకి తెలిసింది వాళ్లు మచ్చిక చేసుకున్నవాటిసంగతే! ఇతరగొడవల్లో కలుగజేసుకోటమంటే వాళ్లకి తలనొప్పి. వాళ్లు కొనుక్కునే వస్తువులుకూడా ఇతరచోట్ల తయారు చేయబడ్డవే. ముడిపదార్థాలని ముట్టటానికి విసుక్కుంటారు. స్నేహితులని అందచేసే అంగళ్లుకలికానికైనా కనబడవు అంచేతనే మానవుడికి స్నేహితులు అనేవాళ్లు బొత్తుగాలేరు ...

ఒక స్నేహితుడు కావాలని నువ్వే అంత వుబలాటపడుతూవుంటే నన్నెందుకు మచ్చిక చేసుకోకూడదో చెప్పు?'' అని సూటిగా ప్రశ్నించింది.

I

నక్క ఇలా అనటం రాజకుమార్‌కి వింతగా వుంది. తను ఎన్నోలోకాలని చూశాడు. వింత వింత మనుషులని కలుసుకున్నాడు. కాని ఎవళ్లూ ఇలా వాడితో మాట్లాడినవాళ్లు కారు. ఒక వింత ఏమిటి? నక్క ఇంకా ఏమి చెబుతుందో వినాలనే వుత్సాహం వానిలో తొణికిసలాడుతూ వుంది.

''నిన్ను ఎలా మచ్చిక చేసుకోవాలో, ఆ సంగతంతా నువ్వే చెప్పాలి?'' అని వుబలాట పడుతూ నక్కని అడిగాడు.

''ఇలాటి విషయాల్లో నువ్వేమాత్రం తొందరపడకూడదు ఓపిక వుండాలి. బోలెడంత ఓపిక వుండాలి. ముందు నువ్వు చెయ్యాలసింది నాకు కనపడకుండా ఆ గడ్డిలో దాక్కుని వుండటం. నువ్వు ఎక్కడికి వెళ్లిపోయావో అని నీకోసం తాపత్రయపడుతూ ఆ మూలకేసి చూస్తాను. ఈ మూలకేసి చూస్తాను, నాకేసి రమ్మని ప్రాధేయపడుతూ కంటి సంజ్ఞ చేస్తాను. అలా ఏం చేసినా పల్లెత్తి మాట్లాడవద్దు...

ఒకళ్లొకళ్లు అనవసరంగా కత్తులు దూసుకోటానికి కారణం ఒకళ్లు చెప్పేది ఇంకోకళ్లు అర్థం చేసుకోకుండా వుండటం మూలానే... ఇలా నువ్వు ప్రతిరోజూ చేస్తూవుంటివా నువ్వు నా దగ్గిరివాడివైపోతావు .....'' అని నక్క అన్నది....

మరుసటిరోజున రాజకుమార్ నక్కని పలకరించటానికి వచ్చాడు. అలా అబ్బాయి తనకు ఇష్టం వచ్చినప్పుడు రావటం నక్కకి ససేమిరా నచ్చిందికాదు. 'ఇదిగో, అబ్బాయి! నిన్న నన్ను చూడటానికి ఏ సమయంలో వచ్చావో, ఇవ్వాళ కూడా ఆ సమయంలో వచ్చివుంటే ఎంతో బాగుండేది! ... నువ్వు సాయంకాల నాలుగు గంటలకి నన్ను కలుసుకోటానికి వస్తావనుకో! మూడు గంటలనుంచే నీ రాకకోసం ఎదురుచూస్తూ వుంటాను. అలా ఎదురుచూస్తూ వుండటంలో ఒక విధమైన ఆనందం వుంటుంది. ప్రతిక్షణం ఒక యుగంగా వుంటుంది. అలాంటప్పుడు నీ కోసం వేచి వుండటంలో ఎంతో ఓపిక వుండాలి. నా ధ్యాసంతా నీమీదే వుంటుంది. ఇంక నాలో ఆ సమయంలో రేకెత్తుతూవుండే వుద్రేకం సంగతి చెప్పటం అనవసరం. కాలం విలువ నాకు తెలుస్తుంది. అలా తెలుసుకోటం కూడా ఒక ఆనందమే! అలాకాకుండా నీకు తీరిక వున్నప్పుడే, లేక సరదాగా వున్నప్పుడే ఇక్కడికి వస్తావనుకో... అప్పుడు ఇంతవుబలాటం, వుత్సాహం ఎందుకు వుంటాయి?... ఇలాటి విషయాల్లో మనం కొన్ని సంప్రదాయాలకి తలఒగ్గటం అవసరం కూడా'' అని అన్నది నక్క.

"సంప్రదాయాలంటున్నావు? అంటే ఏమిటి? వాటికి మనం ఎందుకు తలఒగ్గాలి?'' అని నక్క అన్నమాటకి విస్తుపోతూ ప్రశ్నించాడు అబ్బాయి.

''అవన్నీ పూర్వులు మన బాధ్యతలు మనం చక్కగా అవగాహనం చేసుకోటానికి గీచిన గీతలు. వాటిమూలానే ప్రతిరోజూ మన కట్టుదిట్టాలేవో మనకు తెలుస్తూ వుంటాయి. ఈ విషయంలో వేటగాండ్ర సంప్రదాయమేమో నువ్వు తెలుసుకుంటే ఇలాటి విషయాలన్నీ నీకు బాగా అర్థమవుతాయి!.... గురువారం సాయంకాలం వచ్చిందా, వాళ్ల ధ్యాసంతా వాళ్ల వూళ్లోని హోటల్లోకి గబగబ ముస్తాబు చేసుకుని వెళ్లటం, అక్కడ వాళ్లకోసం ఆతృతతో వేచివుండే చక్కని చుక్కలతో కలిసి తెల్లవారేటంతవరకు నృత్యంచేస్తూ, కబుర్లు చెప్పుకుంటూ ఆనందిస్తూ వుండటమూ... హోటల్లో అలా వాళ్లకి ఆ రోజు పండుగ దినమైతే, నా పండుగ రోజు కూడా ఆ గురువారమే... ఆ సమయంలో ద్రాక్ష తోటల్లో యథేచ్ఛగా తారట్లాడుతూ వుండవచ్చు. చీకూచింతా లేకుండా కోళ్లుండే పరిసరాలలో సంచారంచేస్తూ వుండవచ్చు. అలాకాకుండా వేటగాండ్రు వాళ్లకి నచ్చిన రోజుల్లోనే హోటళ్లకేసి వెళుతూవుంటే ఆనందమనేది నాకెలా వస్తుంది?.. '' అని తన మంత్రం పారటానికి ఎలాటి ఎత్తులని వేస్తుంటుందో నక్క అబ్బాయికి స్పష్టంగా చెప్పివేసింది.

ఆ పూటనుంచి రాజకుమార్ నక్క గీటినదోవనే నడవటానికి మొదలెట్టాడు...

ఒకరోజున నక్కదగ్గర సెలవు పుచ్చుకోటానికి అబ్బాయి వచ్చాడు.

"ఆఁ! నువ్వు వెళ్లిపోతే ఇక్కడ నేనెలా వుండగలుగుతాను?" అని కన్నీరు కార్చసాగింది నక్క.

"ఎందుకలా కంట తడిబెట్టుకుంటావు? నువ్వేగా నన్ను మచ్చిక చేసుకోనమన్నది. అందులో నా తప్పేం వుంది?..." అని నక్క బాధ చూడలేక నిట్టూర్పు విడుస్తూ అబ్బాయి అన్నాడు.

"ఇందులో నీ తప్పేమీ లేదు" అని విచారంతో జవాబిచ్చింది నక్క.

"అలాగయితే ఇలా కంట తడిబెట్టుకోకుండా ధైర్యంతో వుంటావా?"

"ఊ" అంటూ తలనూపింది. తటుక్కున దాని మెదడులో ఏం మెరిసిందో, అబ్బాయికేసి ఆప్యాయంగా చూస్తూ "ఇప్పుడు నీకు తెలిసిందిగా నీకు నచ్చిన వస్తువు నీ హృదయానికి ఎంత దగ్గరగా వుంటుందో?— ఈ రోజా తోటని ఈ దృష్టితో ఒక్కసారి చూడు. దాన్లోని పూలు నీ రోజా పువ్వుకి మల్లె కనబడుతూ వున్నా, ఇవన్నీ ఒక ఎత్తు. నీ రోజా మొక్క ఒక ఎత్తు. అలాగే లోకంలో ఎన్నో రకాల మనుషులు వున్నా, నీకు నచ్చిన మనిషి ఎక్కడవున్నా అతి సులభంగా పసిగట్టగలుగుతావు... వెళ్లిపోతున్న వాడివి అలా తిన్నగా మాయమైపోవద్దు. తిరిగీ నన్ను కలుసుకోటానికి రావాలని నా కోరిక... అలా వచ్చావా మంచి రహస్యాన్ని నీకు చెప్పివేస్తాను." అని అంటూ అబ్బాయిని నక్క సాగనంపింది.

అక్కడినుంచి అబ్బాయి తిన్నగా రోజా తోటకేసి నడుస్తూ పూలని తదేక దృష్టితో చూడసాగాడు. "మీరంతా చూడటానికి ఎంతో బాగున్నారు. అందంగా వున్నారు. కాని నా రోజాపువ్వు ఒక ఎత్తు. మీరంతా ఒక ఎత్తు. నా మొక్కని నేను పెంచి పెద్దచేశాను. అంత ఆప్యాయంతో మీకేసి ఎవళ్లుచూసిన పాపాన బోయినవాళ్లు కాదు. ఆ నక్కతో అంత కలిసిమెలసి వుండకపోతే, దాన్లో ఎలాటి ప్రత్యేకత లేకుండా, వందలకొలది నక్కల్లో అదీ ఒకటి అయిపోయి వుండేది. లోకం తీరంతా ఇలాగే వుంటుందిగా..." అని అబ్బాయి వాటితో అన్నాడు.

(సశేషం)

# మననాటకం

## [పంచవర్ష ప్రణాళికలు]

శ్రీ పోలాకి శ్రీనివాసరావు



(గతసంచిక తరువాయి)

క:-ప్రథమ పంచవర్ష ప్రణాళిక, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అని ప్రవేశపెట్టియుంటిరట. అవి యేనా ?

మా:_ఔను. ఐదేండ్లకొక ప్రణాళిక వంతున నిర్ణయింపబడినది. అప్పుడే మొదటి ప్రణాళిక పూర్తియై రెండవ ప్రణాళిక ప్రారంభింపబడినది.

క:_మొదటి ప్రణాళిక ఎంతవరకు ఫలించినది ?

మా:_మొదటి ప్రణాళిక లక్ష్యాలలో ముఖ్యమైనవి వస్తూత్పత్తిని అధికముచేయుట, అధికోత్పత్తి యొక్క ప్రయోజనాలను అన్ని వర్గాలకు సంక్రమింపజేయుట—— ఇట్టి బ్రహ్మాండమైన మొదటి ప్రణాళిక కొరకు 2,250 కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టబడినది. ఇందు వ్యవసాయోత్పత్తి అధికము చేయుటకు నూటికి 45 పాళ్లు ప్రత్యేకింప బడినవి. ఇక రవాణా రాకపోకల సౌకర్యాల అభివృద్ధికి 24 పాళ్లు, సంఘసంక్షేమ కార్యకలాపాలకు 16.4 పాళ్లు కేటాయించ బడినవి. ఇక కీలక పరిశ్రమలకుగాను ప్రణాళిక పెట్టుబడిలో 8 శాతము యిచ్చారు.

క:_ప్రథమ పంచవర్ష ప్రణాళిక జయప్రదముగా సాధింపబడినదని ప్రతీతి.

మా:-ఇందు ప్రజలపాత్ర చాలా ప్రశంసనీయము.

సీ॥ దేశాభివృద్ధికి । దీప కళిక లాచు
పాల్గొని యుండిరి । పౌరు లెల్ల
తమ కాలమందున, । దమ శక్తి
యందున
కొంత భాగమ్మును । గూర్చినారు.
ధనరూప, శ్రమరూప, । తగ వస్తు
రూపాల
సంఘాభివృద్ధికి । సాయపడిరి,
అన్ని రంగాలలో । నత్యంత సామీప్య
సంబంధ మగు సేవ । సలిపినారు,

తే॥గీ॥ ఆత్మ లోపల విశ్వాస । మందినారు,
గ్రామ సీమ లన్నియు స్వర్గ । సీమ
లనగ
సాముదాయక కార్యముల్ ।
సలిపినారు,
వేడుకను మననాటక । మాడినారు.

ఆశించిన దానికంటే అధికముగా ప్రజాసహకారము లభించినది. కనుక ప్రథమ పంచవర్ష ప్రణాళిక వలన ఆహారధాన్యాల కొరత కొంతవరకు తగ్గినది. వ్యవసాయోత్పత్తి నూటికి 27 పాళ్లు, పరిశ్రమల ఉత్పత్తి నూటికి 41 పాళ్లు పెరిగినది. మరియు, వైద్యసహాయము, విద్యావసతులు వృద్ధిచెందినవి. జాతీయాదాయమునందు 18 శాతము అభివృద్ధి సాధింపబడినది. ఇంకా ప్రణాళికలో పూర్తికాకుండా మిగిలియుండిన కార్యాలతోను; దేశమునకు ముఖ్యావసరమైన కార్యాలను 'ఏదిముందు' అను సమస్యననుసరించి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రవేశ బెట్ట దలచారు.

క:-సరే! మనది ఉపాధ్యాయకులం. కనుక విద్యారంగం గూర్చి మొట్టమొదట వివరించండి! మన వంటి అయ్యవారి నట్టిండ్లు ఎంతవరకు నిత్య కల్యాణం పచ్చతోరణాలను అందుకొంటాయో చూద్దాం!

మా:_విద్యాభివృద్ధి కార్యక్రమాలకు మొదటి ప్రణాళికలో 169 కోట్ల రూపాయలు ప్రత్యేకింపబడగా రెండవ ప్రణాళికలో 307 కోట్ల రూపాయలు కేటాయించడం జరిగింది,

క:_ఓహో! చాలా అభివృద్ధి చేశారే!

మా:-ఈ రెండవ ప్రణాళికలో 89 కోట్లు ప్రాథమిక విద్యకొరకు, 51 కోట్ల రూపాయలు మాధ్యమిక విద్యకొరకు ప్రత్యేకింపబడినవి.

క:_మన దేశములో విద్యాభివృద్ధికి తగిన ప్రోత్సాహ మొసగవలసినదే!

మా:-1950-51 సంవత్సరముల నాటికి మనదేశమందు 6 మొదలు 14 సంవత్సరముల బాల బాలికలు 32 శాతము మాత్రమే పాఠశాలలకు పోవుచుండిరి. మొదటి ప్రణాళిక ముగియునప్పటికి 40 శాతము పెరుగుదల కనిపించుచున్నది. నేటి రెండవ ప్రణాళిక కాలములో 14 సంవత్సరముల బాలబాలిక లందరకు ఉచిత విద్యాసౌకర్యాలు లభించాలని రాజ్యాంగం నిర్దేశించినది.

క:_పిల్లలు విద్యావిహీనులుగా తిరుగుటకంటె యిది చాలా ఉపయోగమే కదా?

మా:-కనీసం అక్షరజ్ఞానం పూర్తిగా పొందువరకైనా విద్యాభ్యాసం సాగించుటకు తగిన చర్యలు తీసుకొనబడుచున్నవి. ఇందుతోబాటు బాలికలు విరివిగా పాఠశాలలందు చేరునట్లు తగిన చర్యలు తీసుకొనుచున్నారు.

క:_11 మొదలు 14 సంవత్సరముల బాలబాలికలలో అనేకులు జీవనోపాది కొరకు పనులు చేయవలసి యుండును గదా; అట్టివారి కొరకేర్పాటు లేమి?

మా:_వారికొరకు "పార్టు టైమ్" తరగతులు నిర్వహిస్తారు.

క:_సరే! చాలా బాగున్నవి.

మా:_ప్రాతిపదిక (Basic) విద్యావిధానమును బహుళ వ్యాప్తము చేయుటకు నిర్ణయింపబడినది. కనుక ద్వితీయ ప్రణాళిక కాలములో అదనముగా 53,000 ప్రాథమిక జూనియర్ బేసిక్ పాఠశాలలు, 3,500 మాధ్యమిక సీనియర్ బేసిక్ పాఠశాలలు ప్రారంభింపబడుచున్నవి. ఈ బేసిక్ విద్యను ప్రోత్సహించుటకు తగిన సాహిత్యమును సృష్టించుటకున్నూ ఏర్పాటులు గావింపబడినవి. మరియు, ఉన్నత పాఠశాలలలో పుస్తక భాండాగారాలను బాగుపరచుట, మాధ్యమిక పాఠశాలలలో వృత్తి విద్యాబోధనను ప్రవేశబెట్టుట జరుగుచున్నది.

క:-శిక్షణ పొందినట్టి సిబ్బంది తగినంతగా ఉంటే గాని ఇట్టివి సాధ్యపడవే?

మా:_ఉపాధ్యాయులకు తగిన శిక్షణ నిచ్చుటకు శిక్షణ తరగతులు అధికముగా ప్రారంభించుచున్నారు.

క:_చెవిటి, మూగ మొదలగు అవిటివారికై పాఠశాలలు పెట్టియున్నారట నిజమేనా?

మా:_ఔను. గ్రుడ్డివారలను, మూగవారలను, చెవిటివారలను దేశమున కుపయోగపడే పౌరులుగా తయారుచేస్తూన్నారు. వీరియొక్క పోషణ భారం యితరులకు కలుగకుండా కొన్ని పాఠశాలలు ప్రారంభింపబడినవి. ప్రయివేటు యాజమాన్యములో నున్న పాఠశాలలకు గూడ గ్రాంట్లు యివ్వబడుతున్నవి.

కమల:_ఔను.

తే॥గీ॥ విద్య యందున మనవారు । వెనుకబడిరి
విద్యయే గద సర్వాభి । వృద్ధి కొరకు
మూలకారణ మందుచే । బూనిక తోడ
సర్వ విధముల నభివృద్ధి । సలుప వలయు.

మా:-విశ్వ విద్యాలయములు, కళాశాలలు అభివృద్ధి పరచుటయేగాక, స్త్రీవిద్య, వృత్తివిద్య మున్నగు అన్నిరకముల విద్యాసౌకర్యములు కలిగించుచున్నారు.

క:-వయోజనవిద్య కట్టి సౌకర్యములు కలిగింపబడినవి?

మా:_నిరక్షరాస్యత నిర్మూలించుటకు వయోజన పాఠశాలలు నిర్మించియున్నారు. వయోజన అక్షరాస్యులకు శిక్షణ యిచ్చుటకుగాను వయోజనోపాధ్యాయ శిక్షణ తరగతులు ప్రారంభించియున్నారు. మరియు, గ్రామస్థులు సాహిత్యగోష్టి సలుపుకొనుటకు హార్మోనియములు, గ్రామఫోనులు రికార్డులు_ నాటకాది నృత్య వేషాదులకు పరికరములు సరఫరా చేయబడుచున్నవి.

క:- విజ్ఞానము కొరకేగాక, వినోదములకు సైతము ప్రభుత్వసహాయము లభించుచున్నదే !

మా:- ఇంకను, గ్రంథాలయములు గలవు. కొన్ని పుస్తకములుండే పెట్టెలను గ్రామసీమలకు గొనిపోయి ప్రజలు చదువుటకు అందుబాటు గలిగింపబడుచున్నవి.

క:- ప్రభుత్వ సహాయమెంతయో కొనియాడతగినది.

మా:- మరచితిని, విద్యావంతులైన నిరుద్యోగులకు సహాయము చేయుటకు ఏకోపాధ్యాయ పాఠశాలలు ప్రారంభించియున్నారు.

క:- ఉపాధ్యాయుల జీతాలను పెంచుటకు తలపెట్టబడినదా ?

మా:- అవా ! రెండవ ప్రణాళికలో ఉపాధ్యాయుల జీతాలను కొంతవరకు బాగుపరచుటకు సంకల్పింపబడినది.

క:- వీటన్నిటి గూర్చి వివరించియున్నారు. వెనుకబడిన జాతుల కట్టి విద్యాసౌకర్యములు కలిగించియున్నారు?

మా:- ఘడియ క్రిందట మన సద్వంశమును పాడుచేయుచున్నానని యంటివే; యిప్పుడు వెనుకబడిన జాతులపై అభిమానము కలిగినదా ?— వినుము, మన రాజ్యాంగము మన జనాభాలో షెడ్యూల్డు కులాలు, జాతులు, ఇతర వెనకబడిన జాతులు అను పేరుతో ప్రత్యేకించినది. ఈ తెగలవారికి ఉచిత విద్యార్థివేతనము లివ్వబడుచున్నవి. వారి వారి భాషలందు విద్య నేర్పబడుచున్నది. ఆర్థికముగా వారి స్థితులు బాగుచేయబడినవి. వృత్తులలో శిక్షణ యీయబడినది. వ్యక్తులకు సబ్సిడీలు యివ్వబడినవి. చిన్న పరిశ్రమల కొరకు సహకార సంఘములు ప్రారంభింపబడినవి. గృహవసతులు ఏర్పాటు గావింపబడినవి. వైద్య సౌకర్యాలు చేకూర్పబడినవి. వన్యప్రాంతాలలో రాకపోకల సౌకర్యాలు అభివృద్ధి చేయబడినవి. అంటరానితనమును రూపుమాపుటకు అస్పృశ్యతా నేరము చట్టమును అమలు జరుపబడినది.

క:- చాలా అభివృద్ధికై ప్రభుత్వము తోడ్పడుచున్నదే!

ఆ॥వె॥ వెనుకబడిన యట్టి । వివిధ వర్గమ్ముల
నైకమత్య మమర । నాదరించి
సర్వ రంగములను । సర్వాభి వృద్ధిని
గలుగజేయ బడుట । ఘనత గాదె.

మా:- హరిజనులకు, షెడ్యూల్డు కులాలకు, ఇంకా వెనుకబడిన జాతులకు అందరికీ కలిపి ఒకేచోట గృహములను నిర్మించుటకు ప్రభుత్వమువారి ఉద్దేశ్యము.

క:- నిజమే! అస్పృశ్యత నిర్మూలము కావలసినదే!

మా:- కాదా ! ఈ జాతుల హీనస్థితి మన నాగరికతకే తీరని కళంకము. కనుక, సంఘములో వీరు తగిన స్థానము నాక్రమించునప్పుడే మన నాగరికత, మన సంస్కృతి గర్వకారణములు కాగలవు.

క:- అయిన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వీరికొరకు చాలా అభివృద్ధికి స్థానమున్నటులే !

మా:- ఔను. వీరికొఱకు 91 కోట్ల రూపాయలు ప్రత్యేకింపబడినవి. సర్వాభ్యుదయమునకు, విద్యాభివృద్ధికి ప్రత్యేక ప్రాధాన్యమివ్వబడినది.

క:- ఇంకొకతూరి ప్రసంగించవచ్చును. మీరు పాఠశాలకు పోవుటకు వేళయగుచున్నది.— టీ— త్రాగరు కదూ ?

మా:- ఊఁ! ఊఁ !!—

క:- ఉప్మానైన భుజించండి !

మా:- సరే!

తెరవ్రాలును

(సశేషము)



# శ్రావణ మంగళవారం

## శ్రీ అయ్యగారి విశ్వేశ్వర రావు

(గతసంచిక తరువాయి)

ఆఫీసులో అడుగుపెట్టాక అనుకున్నాను. క్రిందటి మంగళవారం చాలా అవస్థపడ్డాను-తలనొప్పితో-రిక్షావాడిపోరుతో-శ్రీమతి యింట్లో లేకపోవడంతో. యివాళైనా చెప్పలేదు చూడండి ఆవిడ, మళ్లీ నన్ను బాధపెట్టడం ఆవిడకు ఆనందమంటారా? ముందరగా - యివాళ మంగళవారం - చాలా పేరంటాలు వున్నాయి. తొందరగా యింటికి రావడం పడదు. మీరు ఆఫీసునుంచి మెల్లిగా మొదటిఆట సినీమాకిపోయి - హాయిగా పదింటికి రండి అనైనా చెప్పచ్చు, లేదా రెండు తాళంచెవులున్న గాడ్రెజ్ తాళంకప్ప సింహద్వారానికి బిగించి ఒకతాళంచెవి తనదగ్గఱ వుంచుకొని _ రెండోది నాకివ్వచ్చు. ఏ బాధా ఎవరికీ వుండదు. అలా ఏదీ చేయకుండా _ ఏమీ చెప్పకుండా _ ఎలాగోలాగ నన్ను యిరుకులో వుంచాలని యింటావిడ తీర్మానించిందా? తికమకగా వుంది. దేవుడి దయవల్ల యివాళ తలనొప్పి రాకూడదు. మనీపర్సు ఆఫీసు డ్రాయరులో మరిచిపోకూడదు. డబ్బులు లేకుండా రిక్షా ఎక్కకూడదు - అని గత మంగళవారంనాడు నన్ను డీలాచేసి డింకీలు కొట్టించిన లోపాలన్నీ సవరించుకోవాలని తీర్మానించుకున్నాను. అటెండెన్సు రిజిస్టరులో సంతకం పెట్టాను. సీటులో కూర్చుని చలాకీగా పనిచేసుకుంటున్నాను. ఇంతలోనే దఫేదారు జగ్గయ్య అయ్యగారు రమ్మంటున్నారని చెప్పాడు. ఎందుకు పిలిచారో - ఏవిటో! అనుకుంటూనే కొంచం జంకుతో పోతున్నాను ఆఫీసరుగారి గదిలోకి. కాని చాలా శుభశకునాల సందడితో ఆఫీసుకు విచ్చేసిన మనకు అన్ని విధాలా అన్ని రంగాలలోనూ ఆఫీసులో జయం - విజయం సిద్ధించక తప్పదనే ధీమా మాత్రం జంకలేదు. ఆఫీసరుగారు నన్నుచూసి పకపక నవ్వి - రండి రావుగారూ - రండి - అని మళ్లీ పకపక నవ్వారు.

ఒకరు నవ్వుతూంటే ఎదుటివాళ్లకీకూడ నవ్వు వస్తుంది. మరొకరు నవ్వుతూంటే భయంవేస్తుంది. ఇంకొకరు నవ్వుతూంటే కోపం వస్తుంది. ఇంకొరకం నవ్వు మనకు సిగ్గు తెప్పిస్తుంది. ఇలాంటి నవ్వులెన్ని కదూ - నాలుగువిధాల నష్టం అన్నారు మన పెద్దలు

మా ఆఫీసరు - నన్ను రమ్మని పిలిచి యిలా పకపక నవ్వుతూ - రండి! రండి! అని మర్యాదచేసినా నాకది అంతా అయోమయంగా వుంది. నిష్కారణంగా నన్నుచూసి నవ్వుతాడా? అంతటి పెద్దమనిషి! లేకపోతే నన్నుచూసి నవ్వవలసినంత అత్యవసరం ఆయనకేమివుంది? తెలియక తికమకలో పడ్డాను.

అయితే రావుగారూ! యివాళ యేవారం అండీ? అని అడిగాడు ఆయన. వారాల వివరం తెలియకుండా వుంటాడా? యీయన. తెలిసేవుంటుంది. తెలిసిన విషయాన్ని నన్నెందుకు అడుగుతున్నాడు? ఆఫీసులో అందర్నీ వదిలి నన్నెందుకు అడుగుతున్నాడు? ఈయనకి శ్రావణమంగళవారం సరదా వుందా? లేకపోతే వాళ్ల ఆవిడకూడా మా ఆవిడలాగే శ్రావణమంగళవారం సర్క్యూటు కొట్టుతోందా. ఏమో! అయినా చెబుదాం. అడిగినది పెద్దమనిషి, ఆఫీసరు, తెలిసి అడగవచ్చు_తెలియక అడగవచ్చు. నిజం నిండుగా చెప్పదాం అని తీర్మానించుకొని _ ఇవాళ మంగళవారం సార్, శ్రావణ మంగళవారం. చాలా మంచిరోజు. పూర్వం శ్రావణ మంగళవారం గవర్నమెంటువారిచే డిక్లేరు కాబడిన పబ్లిక్ హాలిడే. కాని హాలిడేస్ రేషనింగులో గుటకాయస్వాహా చేయబడిన యన్. జి. వోల దుర్దినం. కాని అతివల ఆనందదినం, పేరంటాండ్ర పర్వదినం... అంటూ ఆయన నా వాగ్ధోరణిని మెచ్చుకొని మంచి అయిడియా మనస్సులో వుంచుకుంటాడని చెప్పాను.

ఇదంతా చల్లగా విని ఆ అసాధ్యుడు హెడ్ గుమాస్తాని పిలవమన్నాడు, చెప్పద్దూ, నాకు భయమేసింది. ముచ్చెమటలూ పడుతున్నాయి. ఒకందుకు మాట్లాడితే యింకోటి సంఘటించినంత చావు వచ్చినట్లుంది. ఆవేశంలో శ్రావణ మంగళవారం గొప్ప చెప్పాను. అదే చిక్కయిందా? అవును శ్రావణ మంగళవారం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూచే

ఘోటకబ్రహ్మచారులున్నారు. ఆవేళ అమాయకులైన ఆడపిల్లల వెంటపడే కామదాసులూ వుంటారు. దవడ వాచేటట్టు లెంపకాయలు తినే రౌడీలు వుంటారు. ఆ మహిళల సౌందర్యాన్ని చూసి వుప్పొంగే వుత్సాహవంతులూ వుంటారు. "ఎ థింగ్ ఆఫ్ బ్యూటీ యీజ్ జాయ్ ఫరెవర్" అనే కీట్సు శిష్యులూ వుంటారు, నన్ను అలాంటి వర్గంలో జమ కట్టడానికా యీయన హెడ్‌గుమాస్తాను పిలిచింది! అదేం న్యాయం చెప్పండి. నలుగురి పిల్లల తండ్రిని - సగం నెరిసినజుట్టు కలవాడిని — నలభై ఏళ్లు నిండిన వాడిని నాకే కీచకవ్యామోహం వుంటుందని వూహించడం ఎంత న్యాయమో వూహించండి.

హడావిడిగా హెడ్ గుమాస్తా కోటు సర్దుకుంటూ — కళ్లద్దాలు తగిలించుకుంటూ ఆఫీసరుగారి దగ్గఱకు వచ్చాడు. నన్నూ — నా పోజూ నిదానిస్తూ, ఈ హంగామా అంతా చూస్తున్నాను - మతిలేదు: అసాధ్యుడు — ఆఫీసరు అటెండెన్సు రిజిస్టరు ఎత్తి చూపెట్టాడు ఆ హెడ్‌గుమాస్తాకి. చూపెడుతూ అన్నాడు— చూశారా! యుద్ధం రోజుల్లో గడియారాలు గంటముందు చూపించేవి. ఈ శ్రావణ మాసంలో మన రావుగారి మనస్సు ఒకరోజు ముందు పోతూంది - అని మళ్లీ ప్రారంభించాడు మా సేసిన మాయనవ్వుని.

ఔను సార్. మన రావుగారు మంగళవారం సంతకం కూడా సోమవారంనాడే పెట్టేశారు అన్నాడు హెడ్‌గుమాస్తా - అటెండెన్సు రిజిస్టరు చూసి!

అది కాదండీ! వీరికి అన్నివారాలు శ్రావణ మంగళవారాలైతే బాగుండును. ఇప్పుడే శ్రావణ మంగళవారం మీద ఎంతో మాట్లాడారు అని మళ్లీ అన్నాడు ఆ అసాధ్యుడు.

అతడు అలాంటి దురూహాలు గలవాడు కాదండి. సీనియరు అప్పరు డివిజను గుమాస్తా, పిల్లలున్న వాడు. మర్యాదగల వంశీకుడు. మర్యాగదల వంశీకుడు. అతడికి శ్రావణ మంగళవారం పిచ్చగాని - వేటగాని లేవండి! అన్నాడు హెడ్‌గుమాస్తా. ఆయన కాండక్టు సర్టిఫికెట్టు కళ్లద్దుకున్నాను. పరువు నిలబడింది.

ఊరికే అన్నాను సీరియస్‌గా తీసుకోకండి రావుగారూ! అన్నారు ఆఫీసరుగారు. అబ్బే! అతను చాల స్పోర్టివ్‌గా వుంటాడండి అని చెప్పి — హెడ్ గుమాస్తా - నన్ను భుజంమీద చరిచి లాక్కొచ్చాడు అఫీసుహాలులోకి. తోటి గుమాస్తాలంతా ఏవిటేవిటి? అని అడుగుతూంటే - మా మంచివాడు ఆ హెడ్ గుమాస్తా అన్నాడు - ఏముంది? ఇదంతా - టీ కప్పులో తుపాను!

ఆదో మాదిరిగా — నిండిన నిరుత్సాహంతో యింటికి వచ్చేసరికి — మా శ్రీమతి అలా వున్నారేం? అంది. కాళ్లూ - వేళ్లూ — ముఖం కడుక్కొని — తుడుచుకొని — యీజీచెయిర్లో మేను వాల్చి - యిల్లాలు యిచ్చిన ఆ వేడికాఫీ తాగుతూ - ఆఫీసులో జరిగిన ట్రాజిడీ చెప్పాను ఆవిడకు.

ఇదంతా విని - మా శ్రీమతికూడా మా ఆఫీసరులాగే పకపక నవ్వింది. నా మనస్సు అన్నిడిగ్రీల వేడిలో కుతకుత కాగిపోతూంటే నా సహధర్మచారిణి సందుచూసుకొని యింతగా నవ్వడం నాకేమీ బాగాలేదు. ఎంతైనా కోపం వచ్చింది - మా ఆవిడ మీద. కాని కోపించలేదు - శాంతిప్రియుణ్ణి కాబట్టి!

ఆవిడ అంది అప్పుడు, ఎంత అమాయకులండీ! అని.

ఇది మరీ బాగుంది. ఎలా చెప్పగలదు ఆవిడ నేను అమాయకుడినని? రీజను లేకుండా కంక్లూషను వుంటే చెడ్డచిక్కు సుమాండీ.

మళ్లీ అందుకుంది మా శ్రీమతి, ఎప్పుడు పేరంటాళ్లు కనిపిస్తే అప్పుడే శ్రావణ మంగళవారం అనుకున్నారు కదూ! అంది నవ్వుతూ.

ఔను. - అదే పాయింటు. ఆ ఎదురయిన పేరంటాండ్ర మూలంగానే క్యాలండర్ రోజులలో గలాట వచ్చింది నా మనస్సులో అన్నాను.

ఇంత వెర్రివారు ఎలా బ్రతుకుతారండీ! అంటూ జాలిగా అని మళ్లీ అందుకుంది. మంగళవారంనాడు పేరంటానికి రమ్మనమని సోమవారంనాడు పిలుచుకోరటండీ అంది. ఇంత మాత్రం తెలియలేక పోయారా? అనే చూపులతో.

ఒహో? అదా సమాచారం అనుకుని అటెండెన్సులో పడిన రెండు సంతకాల మాటా తలుచుకొనే సరికి ఆఫీసరుగారి పకపక నవ్వులు చెవుల్లో మారు మ్రోగాయి. 'ప్రమాదో ధీమతామపి' అనే సూక్తి జ్ఞప్తికి వచ్చి శాంతినిచ్చింది.

◆ ◆ ◆

వంట అయిందా లేదా! చప్పున కానీ వడ్డన! యివాళ జరూరుగా పోవాలి అఫీసుకి అన్నాను మా

ఆవిడతో. పెషావరు మెయిలు స్పీడు తగ్గించండి - కాస్త అంది ఆమె నవ్వుతూ. ఏం _ ఆఫీసుకి యింకా టయిం కాలేదనుకుంటున్నావా? చప్పున వడ్డించు _ యివాళ పెందరాళే పోవాలి - ఎన్నో అర్జంటు కాయితాలు వున్నాయి - అన్నాను.

మీరు మంచివారు కాని - యివాళటికి కాస్త శలవు పెట్టండి - నా మాటవిని అంది ముసిముసి నవ్వులు పూరించే ముఖంతో. సరే - బావుంది. శలవు పెట్టడం అంత తేలిక అనుకున్నావా, యివాళ అలా శలవు పెట్టడానికి వీల్లేదు - అన్నాను.

అవునులెండి. శలవుకోసం మీకు అవసరమైన రోగాలు వస్తాయి ఎన్నైనా. ఏ రోగం లేక పోయినా - శలవుచీటీలో జ్వరాలు - తలనొప్పులు - విరోచనాలు - దగ్గు _ బంకవిరోచనాలు బ్రహ్మాండంగా కనిపిస్తాయి. అబద్ధాలాడినా సరే _ పాపం లేదని _ పాతికన్నర తప్పుడు కారణాలతో శలవు సంపాయించుకుంటారు యిష్టమయితే. నేను అడిగాను కదా! అనేగా శలవురాదు _ శలవులేదు _ శలవు యివ్వరు - అంటున్నారు _ అంది మూతి బిడాయించి _ చిరుకోపం చిందిస్తూ మా శ్రీమతి.

ఇంతకీ - ఎందుకు నేను శలవు పెట్టడం - ఆ మాట ముందర చెప్పు తరవాత నేను - ఆపని సాధ్యమో! అసాధ్యమో! ఆలోచిస్తానన్నాను.

ఆమాట అనగానే - ఆవిడ ఆనందంతో మొహం యింతచేసుకొని - మావారు దారికే వస్తున్నారనే మురిపెంతో యిలా అంటుంది.

"ఏమీ లేదండి. ఇవాళ ఆఖరు మంగళవారం కదూ, చాలా పేరంటాలు వున్నాయి. వీరభద్రపురం-దానవాయిపేట - యిన్నీసుపేట _ వరకూ పోవాలి. ఈ పిల్లలతో అన్నియిళ్లూ తిరగడం యిబ్బందిగా వుంటుంది. వీళ్లందరినీ యింట్లో పెట్టుకుని హాయిగా మీరు ఆనందిస్తూవుంటే శ్రావణయాత్ర చక్కగా సాగించుకొని చప్పున వస్తాను." అని ముగించింది.

ఇదా నీ హితోపన్యాసం. చాలా బావుంది. మీసంవున్న మగాణ్ణి ఆడంగిఅబ్బన్న కింద యింట్లో అలా అఘోరించమంటావు. ఇదేనా నీవు చెప్పేది. ఇందుకనా - నన్ను శలవుపెట్టమన్నది. మంచిదానవు కాని _ ఆ వచ్చే శనగలు ఎన్నో అంచనా వేసి చెప్పు. ఇప్పుడే కిరాణా కొట్లో కొని నీముందు పడేస్తా. పేరంటాళ్ల కెళ్ళేబాధ నీకూ తప్పుతుంది, శలవుచీటీ రాసే నాకూ తప్పుతుంది _ అన్నాను మంచివేడిగా.

ఇంతధాటీగా నేను అంటున్నా _ వేడివేడి కోపాన్ని _ ఐస్‌కూల్ గా చేసిపారేసే చల్లని ఘాటు నవ్వు నవ్వుతూ - ఆడాళ్ల మాటలు విన్నంత మాత్రంతో ఆడంగి అబ్బన్నలు అవరండీ! ఆడాళ్లని సుఖపెట్టేవాళ్లు ఎలాంటివాళ్లు? సంఘానికి దివ్యజ్యోతులు! అరమరికలేని మనసులతో—ఆలుమగలన్నప్పుడే యింట్లో ఆనందం - అయితే స్వర్గం! అని మీరు అందరికీ చెప్తుంటారు, కథలు వ్రాస్తారు పత్రికలలో, కర్టెను లెక్చర్లిస్తారు. అనుభవానికివస్తే యిలా ఫిరాయిస్తారు ధర్మమేనా చెప్పండి - అంది.

అలా అన్నావా? నా బాధకూడా గమనించాలి. ఇటీవలే కదా! శ్రావణ మంగళవారం అనే అపోహ ఎంతదుమారాన్ని లేవగొట్టిందో ఆఫీసులో _ విన్నావుగా. నాకేదో శ్రావణ మంగళవారం అంటే ప్రత్యేక మమకారం వుందేమోనని అనుమానం ఆఫీసులో వుంది. సరిగ్గా అదే మంగళవారంనాడు నేను శలవు పెడితే - ఆఫీసువాళ్ల అనుమానానికి బలం కాదూ! అయినా - శలవు పెట్టినప్పుడు కారణం చెప్పాలి. ఆ కారణం వాళ్లకి నచ్చేటట్టుండాలి. మా ఆవిడ పేరంటానికి వెళ్లుతూంది కాబట్టి, పిల్లలందర్నీ యింట్లో దిగబెట్టింది కాబట్టి, ఆవిడ వచ్చేదాకా ఆ పిల్లల్ని సంరక్షించే భారం నామీద వేసింది కాబట్టి యీరోజున ఆఫీసుకు హాజరు కాలేనని వ్రాసినా _ ఆ శలవుచీటీ ఎంత నవ్వుల పాలవుతుందో కాస్త ఆలోచించు అన్నాను.

(సశేషము)

# మానవులను భక్షించు చెట్లు

మూలము : రాల్ఫ మిడిల్‌టన్ ♦ అనువాదము : శ్రీ నిజామొహియుద్దీన్ ఖాన్, బి. కాం.

* * *

♦

చరములచరముల భుజించునటు లచరములు చరములను భుజించుట ఆశ్చర్యకరము. అచరములయిన వృక్షములు చరాచరములపై నాధారపడు విషయము మనకు తెలియును. కాని వృక్షములు మానవులను భక్షించుట అసహ్యము కదా. చరములు చరముల భుజించుట, అచరములచరముల సారము గ్రహించుట విచిత్రకరముగాదు. మానవులు వృక్షములపై ఆధారపడునట్లు, వృక్షములు కొన్ని మానవులపై జంతువులపై నాధారపడి జీవించుచున్నవి.

మాంసమును ఆరాధించే వృక్షములు ప్రపంచములో 450 రకములున్నవి. వీటిలో 11 విధముల చెట్లు శీతలమండలములందు, మిగిలినవి ఉష్ణమండలమందు, సమశీతోష్ణమండలములందున్నవి. ఈ చెట్లలో చిన్న చెట్లశక్తులుకూడ ఆశ్చర్యమును కలిగించును.

మానవులను భుజించుటలో యశస్సు పొందిన వృక్షము మెడగాస్కర్ ద్వీపమునందున్నది. దీని కొమ్మలు పొడవుగ కాడలవలెనుండును. దీని ఆకులు గట్టిగను, చెవులవలె ముడుతలు పడియుండును. దగ్గరకు వెళ్లినవారిని దీని ఆకులు, కాడలు చుట్టుకొనును. దానినుండి ఎవ్వరును విడిపించుకొనలేరు. కొన్నేండ్ల క్రితము అడవి ప్రాంతములలో నున్న అనాగరిక ప్రజలు, ఈ వృక్షమును దేవతగ భావించి కన్నియలను బలిచేసెడివారు. ఈ ఆచారము నేటి వరకున్నది. ఈ చెట్టు 'సన్ డివ్' అను జాతికి సంబంధించినదని వృక్షశాస్త్రజ్ఞులనుచున్నారు.

సన్‌డివ్ చెట్టు చిన్న చిన్న కీటకములను భక్షించును. ఈ చెట్ల ఆకులు లావుగను, సువాసన కలిగియుండును. సూర్యరశ్మిలో ఈవృక్షములు ప్రకాశించుచుండును. వీటి సువాసన కతమున కీటకములు ఆకులపై వ్రాలును. తత్క్షణము ఆకులు ముడుచుకొనును. ఆకులముడుతలలో కీటకము ప్రాణమువదలి, దానిలోనే జీర్ణమగును. తరువాత ఆకు తెఱచుకొనుటలోదాని చిన్న ఎముకలు క్రిందికి వ్రాలును.

మానవులను భుజించుచెట్లలో బ్లాడర్ వర్ట్ మరొకవిధమైనది. ఈ వృక్షము నీటిలో పెరుగును. దీనికి చిన్న చిన్నకోశములుండును. కోశములు బోనుతలుపులవంటి, తలుపులు కలిగియుండును. నీటిలో సంచరించు పురుగులు చేపలు ఈ కోశములోఁబడి ప్రాణమువదులును.

మనుజులను తిను చెట్లలో కడవచెట్టు

(Pitcher Plant) ఉష్ణమండలమందు పెరుగును. దీని ఆకారము గిన్నవలెనుండి, చిక్కని ద్రవపదార్థము గలిగియుండును. దీనివాసనను జూచి కీటకములు చెట్టుపై వ్రాలును. కీటకము వ్రాలినవెంటనే చెట్టు ముడుచుకొనును. కీటకము ద్రవపదార్థములో పడి మరణించును.

చెట్లలో విషకరమైన చెట్లు కలవు. ఆర్జెంటైనాలో వాంపైర్ అను చెట్టుకలదు. ఇది సువాసన కల్గియుండును. ఈసువాసన మత్తుకలిగించును. దీని దగ్గరకువచ్చినవారు స్పృహతప్పిపడుదురు. వెనెజులాలోని పులి చెట్టు విషకరమైనఆమ్లములు ప్రసరించును. జావాలోని ఉపాస్ చెట్టు విషవాయువును ప్రసరించును. దీని ప్రాంతమందు మానవులెవ్వరును వెళ్ళరు. ఈ చెట్టుపైనుండి ఎగురు పక్షులు మరణించి క్రిందపడుచుండును. దీని దరినున్న కాలువలలో చేపలుండవు. జావాలోని వేటకాండ్రు బల్లెములకు విషముపూయుట కొరకు దీని జిగురు అతి జాగ్రతతో తీయుచుందురు.

బ్రెజిల్‌లో మాన్‌కి-నీల్ అను వృక్షపు పుష్పొడి బాటసారులపైబడి మరణము కలిగించుచుండును. మెక్సికోలోని దంతవైద్యులు దీని ఆకులను వైద్యము కొరకు ఉపయోగింతురు. దక్షిణ ఆఫ్రికాలో అడేనా చెట్లు అతి భయంకరమైనవి. ఈ చెట్ల విషము నాగుపాము విషముకన్నను అపాయకరమైనది. ఈ అడేనావృక్షము మానవుల ఎముకలనుకూడ జీర్ణము చేయగలదు.

— — —

# మతకర్తలు : తద్భక్తిభేదములు

[ పయిశీర్షికతోఁ గొన్నివ్యాసములు 'గృహలక్ష్మి' లో
ప్రతిమాసము వెలువరింపఁ దలంచితి. అందిది మొదటిది. ]

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

(గత సంచిక తరువాయి)

ఒకానొకప్పుడు కాపాలిక మతానుయాయి యొకఁడు శంకరుని దర్శించి "ఆర్యా, తాము తత్త్వసత్య స్వరూప గ్రహణులయితిరి. కాన శరీరము గాపాడుకొనవలసిన యవసరము తీరినది. కాని, నేనా ఆత్మ తత్త్వసత్యమునం దింకను అభ్యాసదశలోనే యున్నాడను. కాన, సత్యము గనుగొన్నవాని మస్తకము నాకత్యంతావసరము. తామా తెఱఁగునఁ దమతల నీయ సమ్మతింతురేని, నాకోరిక ఈడేరఁగలదు" శంకరుఁ డందులకు సమ్మతించి "నీకోరికవిషయము వెల్లడించెద. దానిని గూఢముగ నీమనస్సునం దుంచుకొనుము. నీకోఱకయి నేనిపుడు సమాధి నవలంబింతును. నీవు సమయమును గనిపెట్టి నాశిరమును తెగఁగోసికొని పొమ్ము" అని వచించి, సర్వసిద్ధుఁడయి సమాధి నధిగమింపఁ గూర్చుండెను. అంతలో కాపాలికుఁడును ఒఱనుండి ఖడ్గముం దీసి, ఝళిపించి శంకరుని తలఁ గోయనుంకించెను. ఇంతలో పద్మపాదాచార్యుని కీవృత్తాంతము నాతని కులదైవమగు నరసింహ భగవంతుఁడు దెలుపఁగా, నాతఁడు సమాధిస్థితియందున్న తనగురుని యెట్టెదుటఁ బ్రత్యక్షమయి, కాపాలికుని ఖడ్గమునే యాతనిచేతినుండి యూఁడబెఱికికొని, యా కాపాలికునితలనే ఖండించెను.

శంకరుఁడు పెక్కుదేవాలయములను నిర్మింపించెను. అనాత్మవాదులను, నాస్తికులను పెక్కురను ఉద్ధరించెను. పలువురచే నవలంబింపఁబడు దురాచారములనుగూర్చి ఖండించి వారికి భగవత్తత్త్వమును మనమున నాటునట్లు బోధించెను. సత్యమయినదియు, నిశ్చలమయినదియు నగు వస్తువేదియో దాని నిజస్వరూపమును వెల్లడించెను. ఏ మతమయినను హృదయనైర్మల్యమునకు దారిఁజూపుఁగాక, వరి యవలంబించు [illegible] హృదయ

నైర్మల్యము గలిగి చిత్తశుద్ధితోఁ బరిశీలించువానికి భగవత్సాక్షాత్కారమగు ననుట యాతని నిశ్చయము. అపరిజ్ఞానము, అశుభ్రమనస్సు గలవాఁడెంతపట్టుదలతోను, దీక్షతోను, నిశ్చలత్వముతోను బరిశీలింప బ్రయత్నించినప్పటికిని, సత్యమగు తత్త్వరహస్యము బయలుపడదని శంకరుని యభిప్రాయము. క్రమపద్ధతినుండి తొలగని కర్మయోగముచేతను, భక్తిమార్గముచేతను మానవుడు తరింపఁగలడని ఆతని సంపూర్ణ విశ్వాసము,

## భక్తినిగూర్చి శ్రీశంకరభగవత్పాదులు :-

"మానవుని జ్ఞానసంపాదనమునకు ముఖ్యసాధనముగా నిలిచి, అతఁడాయోగమున సిద్ధి గాంచుటకయి ముఖ్యహేతు వెయ్యదియో — అయ్యదియే అతనికిఁ దుదిగమ్యస్థానమగును. ఆరీతి నగు వస్తువేదియో— అదియే భక్తి."

భగవత్పాదు లింకను భక్తినిగూర్చి నిర్వచించుచుఁ, దన 'వివేకచూడామణి'లో ఇట్లు వచించెను. "స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే", పరిశుద్ధమయిన పరతత్త్వమే తానని అనుభూతి పొందుటయే "భక్తి".

'ఆత్మానుసంధానం'— అనఁగా, ఆత్మకును బరబ్రహ్మమునకును "అవినాభావము" అను తెలివి కలుగుటకుఁ బ్రప్రథమముగా చేకొని, అభ్యసించునదేదియో, అదియే "భక్తి".

ఆయన సగుణోపాసన- ధ్యానమును నిరుత్సాహపఱచఁడు. "భగవత్పాదములయందు భక్తి చూపుటను అభ్యసము చేయనిచో, మనశ్శుద్ధి కుదురదు"- అని ఆయన 'ప్రబోధసుధాకరము'న విస్పష్ట [illegible] ఆయన రచించిన శ్లోకములలోఁ [illegible]

సగుణోపాసమునుగూర్చియు, భక్తిప్రభావమును గూర్చియుఁ, జక్కఁగ వివరించుటంబట్టి భక్తిమహిమ ఎంతగాఢమయినదో, మనకు బోధపడుచున్నది.

సూదంటురాయి, ఇనుమును ఆకర్షించునట్లు తన మఱువు సొచ్చిన ఆత్మను శ్రీవల్లభుఁడుఁ ధనవంతుఁడనియు, ఆకర్షించికొనును. భగవంతుఁడు ఆయాత్మను అనుగ్రహించు పక్షమున- దాని సాంఘికపరిస్థితి, శరీరసౌందర్యము, సంపత్సమృద్ధి మొదలైనవాని విషయం- పరిశీలించి యెంతమాత్రము ప్రత్యేకత చూపడు. పుణ్యాత్ములనిగాని, పాపాత్ములనిగాని భేదం చూపడు. మహాజలధరశ్యాముడు- సర్వబహిరంతర పరిశోధకుడు- అగు అవిశిష్ట- అవాఙ్మానస తత్త్వగోచర- మహాగుణశాలి పరమాత్మస్వరూపములో, శరణాగతమును,- భక్తిసంయుతమును అయి తన్నాశ్రయించు దేనినైన చేకొను సమర్థుడు. ఆయన కరుణాసాగరుడు. కాననే, తన్ను ఆశ్రయించి తన సర్వస్వము అర్పించుదానిని ఆయన ఎన్నడును విడనాడడు. మేఘుడు ముండ్లచెట్లని నిరాకరించి, వానిపై వర్షింపక పోవునా? సురభిళ సుమ సమూహాలం గలది కదా, అని చంపకముపైన మాత్రమే కురియునా? మేఘునివలె భగవంతుడును, నిష్పక్షపాతి. మేఘుడిచ్చు వాననీట తరులతాదుల కన్నిటికీ పాలిభాగమున్నట్లే, విష్ణుభక్తి గలవారి కెల్ల ఆయన కృపాతిరేకమున పాలుగలదు. కాన పాపాత్ముడైనను, పుణ్యాత్ముడయినను, విష్ణుభక్తి యున్నంతమాత్రాన ఆయన కనికరమునకు అర్హమగుట కధికారమున్నది. కావుననే, ఏవ్యక్తి అయినను, భక్తికి వశమయినచో, ధన్యమయినదే. హృదయ పరిశోధకుఁడగు పరమాత్ముఁడెందును గలఁడు.

ఇందుగల డందు లేడను సందేహము భక్తుడికి ఉండదు. భగవన్మహత్త్వము ఎరుగని అవివేకులు, అపరిపక్వ మనస్కులు ఆయనను అందుకొనజాలక, శంకాకలిత చిత్తవృత్తులై డోలాందోళన మందుచుందురు. ఇతరాశ్రయము అవంతయైనను లేకుండ 'అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ'- అని ఆయనకే తన సర్వస్వ మర్పించి ఆయనయపారానుగ్రహ సంపాదనార్థమే యావజ్జీవము కృషి చేయుట నిజమయిన భక్తుని లక్షణము.

**భక్తినిగూర్చి రామానుజాచార్యులు:-**

'భగవంతుడొక్కడు మాత్రమే అత్యుత్తమ సర్వోన్నత శక్తిసంపన్నుడు. ఎల్లప్రాణి వర్గాలకు ఆయనే సాక్షీభూతుడై సమస్తజీవులలోను ప్రకాశించుచున్నాడు. సృష్టములకన్నిటికి ఆయనే ఏకపాలకుడయిన ప్రభువు. జీవులు తమకర్మల కన్నింటికీ ఆయననే ఆధారభూతునిగా చేసికొన్నందువల్ల- వానికాయనే సర్వశక్తులను ఇచ్చేవాడు. కనుక అవి ఆయననే ఆరాధించుచుండును. భక్తుఁడు భగవంతుని నిజతత్త్వమును తెలిసికొనుకొలది ఆయననుగూర్చిన వైవిధ్యము నుండి తొలఁగిపోవుచునుండును. భగవంతుడు సచ్చిదానంద స్వరూపుడని గ్రహించినవెంటనే భక్తుని కదివరకు ఉన్న సంకుచితాభిప్రాయములు దిగజారిపోవును',

అయిన, ఆసచ్చిదానంద మేది? సత్తు,- చిత్తు,- ఆనందము,- అను ఈ మూటిభావాలు ఏవి?—

భగవంతుడగు నారాయణుఁడే. 'సత్తు' (అనగా ఉనికి). దానికి ఎన్నడూ వినాశమనునది లేదు. 'చిత్తు'- అనఁగా, జ్ఞానము. అది లక్ష్మిస్వరూపమయిన శక్తితో గూడిన విజ్ఞానం. ఆనందము (పరిపక్వము అయిన జ్ఞానానుభూతి). ఈయానందస్థితే సృష్టికి మూలకందము. అదే పరమాత్ముని అతీత సంతృప్తి ప్రకటనకు ఆధారము. కేవలము అట్టిఆత్మసంతృప్తి భౌతికమయినను కావచ్చు. కాని,- వాస్తవికము మాత్రము కాదు. దీనినే 'రజ్జుసర్పభ్రాంతి' అని తాత్త్వికులందురు. దైనమోగుండా విద్యుత్తు మోస్తరు ఆయానందము తటాలున ఊడిపడేది కాదు. అయినను చిచ్ఛక్తిమహిమవల్ల భగవానుఁడు మర్త్యలోకమున అవతరించును.— ఈవివరణమునుబట్టి, జీవుడనే శిశువు సృష్టికి ప్రకృతి లక్ష్మీనారాయణులని ఊహించుకోవలె. తలిదండ్రుల వాత్సల్యమునకయి బిడ్డలు వారిని,- మురిపింతురు. తమవంకకు ఆకర్షించుకొనుటకయి ప్రయత్నాలు చేయుదురు. ఆవిధముగనే భక్తుడైనవాడు, తనవాక్కును దైవస్తోత్రాదులలోను, మనస్సును- ఆత్మను సేవలలోను స్థిరముగ నెలకొనునట్లు చేయును. అతడే నిజమయిన భగవద్భక్తుడు.

(సశేషము)

# సదాచార సూత్రములు

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

(గతసంచిక తరువాయి)

29. కళంకరహితమైన శీలమూ, మహోన్నతమైన ఆలోచన, సరళ వ్యవహారం - వీటికన్న ప్రపంచంలో ఏదీ లేదు.
30. సుఖేచ్ఛ అందరికీ ఉంటుంది. కాని తత్ సాధనోపాయాన్ని కార్యరూపంలో పెట్టడంలోనే అనేకులు వెనుకంజ వేస్తూంటారు.
31. దారిద్ర్య, హీనత్వాలందైనా సరే అసత్యంతో ఎవ్వడూ లాభం పొందరాదు.
32. స్వాత్మకు ప్రతికూలంగా నడవడం మహాపాపం, దుష్టుల నిందలకు భయపడి సత్కార్య సద్విచారాలను త్యజించడం అధైర్యమే.
33. మధురవచనాలవల్ల జగత్తు యావత్తు స్వాధీనమవుతుంది.
34. స్వార్థత్యాగీ, సదాచారి అయిన పురుషునకే సంపద లభిస్తుంది.
35. ఆత్మాభిమానియై పవిత్రహృదయంగల పురుషుడు దరిద్రుడైనా సర్వశ్రేష్ఠుడన బడతాడు.
36. శ్రమశీలత్వ, నియమబద్ధత్వ, కర్తవ్య నిష్ఠలవల్లనే ప్రతిభ లభిస్తుంది.
37. విద్యార్థులకు అత్యంతోత్తమ గుణం వారి సరళత్వ శుద్ధజీవితమే.
38. సమయం ఒక్కక్షణం కూడా వ్యర్థం కారాదు. సమయాన్ని ఆశ్రయించుకుని కార్యాన్ని సాధించాలి.
39. ఆడంబరశూన్యమై సంతృప్తికరమైన జీవితం గడపడంవల్లనే శాంతి లభిస్తుంది.

---

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

"కొంచెం అడ్డంవుంది," అని సందేహంగా అంటూ "సరేలే తర్వాత చెప్తాను - అయినా నిరుపమ సంపత్తి నీ సంపత్తేగా!" అన్నాడు అతడిముఖం లోకి చూసినవ్వుతూ "అయినా సమయానికిప్పుడు నిరుపమ దగ్గరకూడ డబ్బులేదు, సురేష్ దగ్గరవున్నట్లుంది. పోనీ ఆతనిదగ్గర తీసుకోవచ్చు అప్పుగా తర్వాత నిరుపమే తీర్చుకుంటుంది ... "

"ఆమాత్రం సహాయంచేశారంటే కృతజ్ఞుణ్ణి... సరేనండి వస్తాను" అంటూ లేచాడు

"సరే సాయంకాలం చెప్తాను" అంటూ యోగేష్‌బాబు కూడా లేచి వెళ్లిపోయే యామునీ బాబుకేసి వికటహాసంతో చూచాడు.

7

కమల నిరుపమ స్నేహితురాలు. నిరుపమ బి. ఎ. చదువుతూ మానేసింది. కమలమాత్రం ఆఖరి సంవత్సరం పూర్తిచేస్తోంది. ఆమె బాగా పాడుతుంది కూడ. కమలవస్తూనే "నమస్తే, నిరూ" అంది నవ్వుతూ,

నిరుపమ ముభావంగా 'నమస్తే' అని వూరుకుంది. ఆమె ముఖం యెప్పటిలా కలకల్లాడుతూలేదు. కమల దగ్గరకు రాగానే తనముఖంలోని విషాదం ఆమెకు తెలియకుండా కప్పిపుచ్చాలని ప్రయత్నించి, లేని నవ్వు తెచ్చి పెట్టుకుని కూర్చోమని కూర్చోమంది.

"కూర్చోడానికి రాలేదు లే – యెక్కడికైనా పోదాం"

ఆ క్షణంలో ఆమాటలు నిరుపమకు యెంతో ఆప్యాయంగా, ఆమెను ఓదార్చినట్లుగా అనిపించాయి. లేచి ముఖం కడుక్కుందుకు వెళ్లింది. కమల స్వతహా చురకైన మనిషి. వచ్చీరాగానే నిరుపమ ముఖాన్ని చూచి ఏదో జరిగిందని అనుమానించింది. నిరుపమ – అందరూ అన్నట్లుగానే – అపురూప సౌందర్యవతి. ఆమెకు అనేకమైన ప్రేమలేఖలు వచ్చేవి. ఆ ప్రేమలేఖలే ఆమె కాలేజిచదువుకు స్వస్తి చెప్పడానికి కారణమయ్యాయి. అటువంటిదేదో మళ్ళీ జరిగివుంటుందనుకుంది. ఒకసారి నిరుపమ బి. ఎ క్లాసులో వుండగా ఒక లెక్చరరు ఆమెకొకసారి ఉత్తరం వ్రాశాడు. ఏంచెయ్యాలో అర్థంకాక నిరుపమ ఆ వుత్తరాన్ని తీసుకొచ్చి మేనమామ చేతుల్లో పెట్టింది. దాంతో అతడికన్నో అనుమానాలుకలిగాయి. ఆమె యిక కాలేజీకి వెళ్లడంమంచిది కాదని చదువు మాన్పించేశాడు. ఆ విషయమై ఆమెను యెన్నోసార్లు కమల వేళాకోళం చేస్తూ వుండేది. అయితే, నిరుపమ యొక్క సరళ స్వభావం, ఆమె నడవడి కమలను యెంతో ఆకర్షించాయి. ఉత్తరాలు వ్రాసేవారికందరికీ ఆమె మీదవుండే ప్రేమకన్న, ఆమెమేనమామకు ఆమె ఆస్తిపైవున్న ఆశ యెక్కువ. ఆ విషయం కమలకూడ మొదట గ్రహించలేదు. అతడు మరొకటికూడా ఆలోచించాడు. ఆమెను చదువుమాన్పించివేస్తే - అది ఆమె మీదిప్రేమవల్లనే - ఆమె చిక్కుల్లో పడకుండా - చేశానని అందరూ అనుకుంటారని అతడూహించాడు.

కమలలేచి నిరుపమ డ్రాయరు తెరిచింది. అందులో యేమీ కన్పించలేదు. మంచంమీదనున్న తలగడ క్రింద చూచింది. అక్కడ ఆమెకేదో ఉత్తరం కన్పించింది. అంతా చదివి మామూలుగా యెక్కడ వుందో అక్కడపెట్టేసింది. ఇంతలో నిరుపమవచ్చి, "యెక్కడికి వెడదాం?" అంది.

ఎక్కడికీ లేదు - గోమతి సైడువరకు వెళ్లివద్దాం అంది కమల నవ్వుతూ.

"అయితే, తిరిగివచ్చిన తరువాత పాట పాడుతావా మరి?"

"అలాగేలే. తిరిగివచ్చిన తర్వాత కదా!"

ఇద్దరూ నవ్వుతో మాట్లాడుకుంటూ నడుస్తూ కేసరీ బాగ్ దాటి వెళ్ళారు. మనుష్యసంచారం తగ్గిపోయింది.

"అదిసరేగాని – నిన్న యివాళిటిలో నీరోమాన్సు యెంతవరకు వచ్చిందేమిటి?" అంది కమల నవ్వుతూ.

"ఏ రోమాన్సు?" అని కమల ముఖంలోకి చూచింది.

"ఏం?... ఎన్నివున్నాయేమిటి?"

"అదికాదు నేననేది ... అయినా నువ్వైతే స్వతంత్రురాలవు. కాని నేను యింట్లోవాళ్లు చెప్పినట్లు చెయ్యాలి" అంది నిరాశగా.

"అంటే - ఒక వేళ ఏదైనా పెళ్లిసంబంధం నిశ్చయమైతే - మీ యింట్లోవాళ్ల అంగీకారం మీద నేనన్నమాట ..."

నిరుపమ సమాధానం చెప్పలేదు. కమలకు కోపం వచ్చింది. "పెళ్లి చేసుకుని, వాడితో కాపురంచెయ్యవలసింది నువ్వా, మీ మామయ్యా? నిరూ, పెళ్లంటే సరసల్లాపాలు కాదు - జీవన్మరణసమస్య - ఒక్క తప్పటడుగు వేశామంటే జీవిత పర్యంతం అనుభవించవలసి వస్తుంది. ... నా సంగతి పూర్తిగా నీకు తెలుసు. నాదగ్గర నువ్వేమీ దాచనక్కరలేదు. నేనేదైనా సహాయం చెయ్యవలసిందుండవచ్చు ... అంటూ యేదో ఆలోచిస్తోంది. నిరుపమ పెళ్ళి చేసుకుని సుఖంగా వుండడంకన్న తనకు కావలసిందేమీలేదు. ఇద్దరికీ స్నేహమైన నాటినుండి ఆమె సుఖదుఃఖాల్లో తానుకూడ భాగస్వామైంది.

కమల యీ విధంగా మాట్లాడ్డం నిరుపమకు కష్టంగా తోచింది. ఈ వివాహం తనకేమాత్రము యిష్టంలేదు, కాని నోరువిప్పి యీమాట మేనమామతో చెప్పలేకపోయింది. కుమార్ లాంటి వాళ్లను చేసుకుంటే యెంతబాగుంటుంది. అయినా, సనాతన సాంప్రదాయాలు, పెద్దలనేవాళ్లు వుండగా పెళ్ళి కాబోయే ఆడపిల్ల మాటచెల్లుతుందా, పెద్దవారి అంగీకారం, ఆశీస్సులు లేకపోతే యిక ఆ జీవితంలో గౌరవమర్యాద లేముంటాయి? అంతా భ్రమ సంతోషసౌఖ్యాలకు పూర్తిగా తిలోదకాలివ్వాలి.

"అవును మనకన్న పశుపక్ష్యాదులకు స్వతంత్రముంటుంది. రోజులుమారుతున్నాయి. రోజులతో పాటు మనుష్యులుకూడ మారుతూవుండాలి. రోజురోజుకు మారిపోతున్న యీ ప్రపంచంలో యింకా సనాతన ధర్మాలు అవలంబించడం కొంతవరకు హానికరమే. మనసులోని మాటను మనసులోనే అట్టే పెట్టుకుంటే జీవితమంతా అట్లాగే వుంటుంది." మళ్ళీ అంది కమల ప్రక్కకు చూస్తూ.

"అవును–కావచ్చు"

"నిరూ, ఒక్క మాట చెప్తాను వింటావా? అన్యథా తలచకూడదు. నీ గురించి, మీ మామగురించి కూడ మానాన్నగారి దగ్గర చాలమాటలు విన్నాను. ఇంతవరకు నీతో చెప్పలేదు."

"అంటే యింతకాలం తెల్సుండికూడా నాకు చెప్పలేదు. యిదేనా నీ స్నేహం?"

"స్నేహమో యేమో నాకు తెలీదు. అసలీరోజు నీతో మాట్లాడుదామనే వచ్చాను. నీకూ, యామినీ బాబుకూ పెళ్లి అవుతుందటగా! ఈ లక్నోలోవున్న బెంగాలీవాళ్ళ కందరికీ తెల్సు. ఎవరి నోటంటవిన్నా యిదేమాట. నీ గదిలో తలగడక్రింద ఒక ఉత్తరం చూచాను. దానివల్ల కొన్ని విషయాలు గ్రహించాను. అయినా, నేను తెల్సుకుందామనుకొన్న విషయం మరొకటుంది. ఈ వివాహం నీకు అంగీకారమయ్యే నీవు చేసుకుంటున్నావా? లేక మీ మేనమామ చేస్తున్నాడా?"

"ఈ విషయం నేను చెప్పలేను. నాకన్నముందరే అన్ని విషయాలు నీకు తెలుసు. నేను చెప్పవలసిందేదో చెప్పాను. అసలు ఆ బడకంకుడికి అలా ఆ బుద్ధి యెందుకు పుట్టాలి.-నా ఖర్మ కాకపోతే. చదువుతున్న దానిని మాన్పించేశారు..."

"అసలు వాడు వ్రాసిన వుత్తరానికి మంచితనంగా సమాధానం చెప్పక మామగార్కి యెందుకు చూపెట్టావు?"

"అవును. ఆయనతో చెప్పడం తప్పే. అయితే, చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుని లాభమేమిటి?...అది సరేగాని...నువ్వు మీనాన్నగారి దగ్గర విన్న మాటలేమిటి చెప్పు..."

"అయితే సరే...విను. మీ మేనమామంటే మా నాన్నగార్కి మంచి అభిప్రాయంలేదు. ఈనాడు ఆయన నిన్ను యింట్లో పెట్టుకుని పోషిస్తున్నాడంటే అదంతా మేనకోడలిమీద ప్రేమేనంటావా? లేక నీ ఆస్థి, సంపదలమీద ఆశ అంటావా?"

"ఆయన నా జమీందారీ యేమీ తీసుకోవటం లేదే!"

"అవును, నిజమే. ఆయన నీ జమీందారీ యేమీ

తీసుకోవడంలేదు. కాని, దానిమీదవచ్చే రాబడి మాత్రం స్వాహా చేస్తున్నాడు. అసలు యెంత డబ్బు వస్తోందో-ఎంత ఖర్చవుతోందో నీకేమైనా తెల్సునా? మీ నాన్నగారు పోయేముందు మీ మేనమామ తన పేర యెంత వ్రాయించుకున్నాడో నీకు తెలుసా?"

"ఆ గాథలన్నీ తెల్సు. అవన్నీ మా నాన్నగారు బ్రతికివుండగానే జరిగిపోయాయి. అయినా మేనమామ గదా చూచేది. ఆయన చెప్పడం, నేను వినడం-యివన్నీ యెందుకు?" అంటూనే ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది.

ఈ మాటలు ఆమె హృదయంలోనుండి వచ్చేవి కాదని కమలకు తెలుసు. మేనమామ తప్పుచేస్తున్నా నలుగురి నోళ్ళలోను పడకుండా చేయడానికే యిలా కప్పిపుచ్చుతోంది. ఇంతలో కనుచీకటి పడింది. ఇద్దరూ వెనక్కు తిరిగి కొంతదూరం నడిచారు. దారిలో టాంగాను పిలిచి, "కమలా, టాంగాలో పోదామా? ఇంకా నీ పాట వినాలి. త్వరగా నిన్ను యింటికి పంపాలి."

కమల టాంగాలో కూర్చుంటూ, "ఏం అంత తొందర. యామినీబాబు వస్తానన్నాడా?"

"యామినీబాబు యింటికి రాడు. కేసరీబాగ్‌లో కల్సుకుంటాడు."

"అయితే నీకు సంతోషమేనన్నమాట." అంది నవ్వుతూ.

"ఏం-నీకు తెలియటంలేదూ? ఇదంతా నన్ను సంతోష పెట్టాలని. మా అన్నయ్య నన్ను తోట వరకు తీసుకువచ్చి వదలిపెట్టేస్తాడు."

"తర్వాత?"

"ఏముంది-కథానాయకుడు ప్రవేశిస్తాడు—కబుర్లు చెప్తాడు..."

"ఏమని...?"

"ఊరికే నన్నడక్కు.. యివన్నీ నీకు తెలియకుండా వుంటాయా? చదివావు... కొన్నాళ్ళపాటు ఆచరణలోకూడ పెట్టావు..."

"కబుర్లు చెప్తుంటే-అసలు నీకెలా వుంటుంది?"

"ఎలా వుంటుందా? రోజూ రకరకాల పక్షుల మాటలు వింటున్నాం - వాటితో బాటు ఇదివి కూడాను..."

"అయితే-యితనితోనేనా నీ వివాహం?"

"ఆఁ...అదికూడ సందేహమే."

8

కమల వెళ్ళిపోయిన తరువాత నిరుపమ ఒక్కతే కూర్చుని ఆలోచించడం మొదలుపెట్టింది. తాను కమలనుండి కొన్ని విషయాలు నేర్చుకుంది—ఈ రోజుల్లో వచ్చిన చిక్కే యిది. మగవాడు ఆడపిల్లను చూచి యిష్టపడవచ్చు. కాని ఆడపిల్లలకు ఆ స్వాతంత్ర్యం లేదు. యామినీబాబుకు తన హృదయంలో స్థానంలేదు. కాని, అతన్ని పెళ్లిచేసుకోవాలి... తాను ఆఖరికి యంత్రంలా తయారైంది. దీన్ని యితరుల యిష్టానుసారం నడపాలా? వెధవ ఆచారాలు-వెధవ సంస్కృతిని.

ఎలాగైనాసరే యీ బురదలోంచి తప్పుకోవాలి. ఎటుచూచినా—యేమాలోచించినా మేనమామే కన్పిస్తున్నాడు. ఆయన్ను గురించి కమల చెప్పింది. అది నిజమే కావచ్చు. వీళ్ళ నడత తానుకూడ ఒకటి రెండుసార్లు కనిపెట్టింది. వాళ్లేదైనా మాట్లాడుకుంటున్నప్పుడు తాను వెళ్ళినట్లైతే చటుక్కున మాటలు ఆపుచేసేవారు. మామగారి దగ్గర తనడబ్బు యెంతవుందో నిజంగా తనకే తెలీదు. అయినా తన కాడబ్బుమీద ధ్యాసే లేదు. ఆ జమీందారీకూడ తండ్రితోబాటే యెప్పుడో పోయిందనుకుంది. సమస్తం వారికి హస్తగతం చేసింది. యీనాడు తాను వారు పెట్టింది తింటూ వారింట్లో వుంది. అటువంటప్పుడు వారికెందుకీ దుర్బుద్ధి పుట్టింది? స్వార్థమంటే యేమిటో నిస్వార్థమంటే యేమిటో ఆలోచించడం మొదలు పెట్టింది. వాటి అర్థం ఆమెకింకా తెలియలేదు. తన ఖర్చుకూడా కొంచెమేనే! అయితే వారికెందుకీ బాధ. కృష్ణకుమార్ యెటువంటివాడో? అతనుకూడ తన జమీందారీలోనివాడే! ఈవిధంగా ఆలోచిస్తూ పడుకుంది. ఇంతలోనే భిల్లుమని తెల్లవారింది. కాఫీ త్రాగుతుంటే దాసీవచ్చి మామగారు పిలుస్తున్నారని చెప్పింది.

దగ్గరికివచ్చిన నిరుపమను కళ్లు పైకెత్తి చూచి "వచ్చావా? కూర్చో.. కొద్దిగా పనుంది" అంటూ యేవో లెక్కలు చూస్తూ కూర్చున్నాడు.

"నిరూ, నేనింతవరకూ నీ నౌకరులాగ నీ జమీందారీ వ్యవహారాలు చూస్తూ వచ్చాను. ముసలివాణ్ణయ్యాను. విశ్రాంతి తీసుకోవలసిన సమయం వచ్చింది,

ఇక నీవు నామాట వినేది కొద్దికాలమే. ఈ విషయాలన్నీ నీతో చెప్పదలుచుకొన్నాను." అంటూ నవ్వుతూ మళ్ళీ పుస్తకంవైపు చూడ్డం మొదలు పెట్టాడు. ఈ ఉపోద్ఘాతం అంతా యెందుకో ఆమె కర్థంకాలేదు. అయినా అంత ప్రేమగా మాట్లాడుతున్నాడు! కల్మషమనేది ఆయన మాటల్లో యెక్కడా లేదే! అందుకనే కాబోలు లోకులు కాకుల్లాంటివాళ్ళని అంటారు. ఎదుటివారిని నిందించడమే వారి పని.

"చెప్పండి మామయ్యా" అంది.

"నిన్ను చూస్తుంటే మా చెల్లెలు రాణి గుర్తుకొస్తోంది. నీవు సుఖంగా పెళ్లిచేసుకొని సంసార జీవితం గడపడం చూచి చచ్చిపోవాలన్నదే నా కోరిక" అని ఆమె ముఖంలోకి పరీక్షగా చూచి, "యామినీబాబుకు డబ్బు అవుసరమట...‥ నిన్న రెండుసార్లు వచ్చి వెళ్ళాడు..."అన్నాడు.

ఆ మాటతో ఆమెలో మళ్లీ అనుమానాలు రేకెత్తాయి. గాలిమేడలన్నీ కూలిపోసాగాయి. అసలు విషయమేమిటో తెల్సుకోవాలనుకుని ప్రశ్నార్థకంగా అతడి ముఖంలోకి చూచింది.

"అప్పుడప్పుడు కానీకూడా చేతిలో లేకపోవడం సహజమే. అసలు మీనాన్న పోయినప్పుడుకూడ దగ్గర కాని లేకపోయింది." అని మళ్ళీ ఆమె ముఖంలోకి చూచాడు ఆమె హృదయాన్ని తోడినట్లైంది. వెంటనే కమల చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయి. ముఖం దించుకుని ఆలోచిస్తోంది. "యామినీబాబుకోసమై యిప్పుడు అప్పుచెయ్యాలి..." అనేశాడు ఆఖరికి. ఆమాట ఆమెకేమీ ఆశ్చర్యాన్ని కలిగించలేదు. తన ఆస్థిపాస్తులు పాడైపోతున్నాయన్న బాధకూడ ఆమెకు లేదు. అప్పుచెయ్యాలని తనకెందుకు చెప్తున్నాడు? అయినా యామినీబాబుకోసమై తనెందుకు అప్పుచెయ్యాలి? ఆమెకేమీ అర్థంకాలేదు.

"నీకు చెప్పవలసినవాణ్ణి కనక చెప్తున్నాను. నా దగ్గర ప్రస్తుతం యేమీలేదు. పైగా పిల్లలిద్దరి భవిష్యత్తుకూడ చూడాలిగా మరి!..."

ఈ విషయాలన్నీ యిప్పుడెందుకో అనుకుంటూ, "అన్నగారి విషయంలో యేదైనా ఏర్పాటు చెయ్యడానికే ఆలోచిస్తున్నాను. ఇక నీలి..."

"నాకు తెలుసమ్మా నువ్వు అందర్నీ ఒకే కంటితో చూస్తావని. మేనకోడలివైనా, నిన్ను స్వంత చెల్లెలుగా చూచుకుంటున్నాడు సురేష్ ..."

ఈ మాటలు మార్చాలనే అభిప్రాయంతో, నిరుపమ చిరునవ్వు నవ్వి, "రామాపురంలో నాన్నగారు యిల్లు కట్టించారు కదూ!" అంది.

"అవును. ఉంది."

"ఒకసారి రామాపురం వెళ్లివద్దామనుకుంటున్నాను."

యోగేష్‌బాబు ఒక్కక్షణం ఆలోచించి "ఇది వేసవికాలమమ్మా. పల్లెటూరిలో కష్టం. ఎండలు మాడ్చేస్తాయి. పైగా నీతో మాట్లాడి కలిసి మెలిసి తిరిగేవాళ్లెవరూ అక్కడ లేరు. అయినా అక్కడ అందరూ హిందూస్థానీవాళ్లు. అందరూ మనల్ని నీచంగా చూస్తారు..."

"ఎప్పుడో ఒకసారి నాన్నగారితో వెళ్లాను. అక్కడ చాల బాగుంది. పల్లెటూరి గాలి మంచిది. అయినా యిప్పుడుకాదులే – మామిడిపళ్ల రోజుల్లో వెడతాను."

"అయినా యెవరెవరు?"

"యెవరున్నారు-నేను, అన్నయ్య, నీలి..."

(సశేషము)

# శ్రీ దుర్గాస్తవము

(బ్రహ్మశ్రీ)



"గృహలక్ష్మి" సంపాదకులు "మననారీలోకము"నకు సంబంధించిన వివిధ విషయములను తమ పాఠకులతో ముచ్చటించుటకు నాకొసంగిన యీ సదవకాశమునకు నేను వారికెంతయు కృతజ్ఞురాలను. గతనలభైయేండ్లుగ ప్రజాజీవితములో నాకు గలిగిన అనుభవము దృష్ట్యా, మనజనాభాలో దాదాపు సగభాగమై, వేలాది సంవత్సరములు అనేక సందర్భములలో వెనుకబడిపోయి నేడు మన సంఘమునందొక విధమగు నిమ్నస్థితి నాక్రమించుచున్న మననారీమండలి యొక్క అభ్యున్నతి యిప్పటిజాతీయ సమస్యలలో ప్రప్రథమస్థానము నలంకరించుచున్నది. అట్టితరి యీప్రముఖ సమస్యపై నా అనుభవము శాస్త్రజ్ఞానము దృష్ట్యా, నాకు తోచిన యభిప్రాయములను "గృహలక్ష్మి" పాఠకులకు అందజేయగలుగుట నాభాగ్యముగ భావించుచున్నాను. ఈ ప్రసంగమునకు ప్రాతిపదికగ, స్త్రీశక్తి స్వరూపిణియగుటచే యీ ప్రారంభ వ్యాసములో యిప్పటికి 26 ఏండ్లక్రిందట "అశరీరవాణి" నాకొసంగిన "శ్రీదుర్గాస్తవ" మను గీతికనిట బొందుపరచెదను. దానియగత్యము ముందు వ్యాసములలో పాఠకులకే గోచరింపగలదు.

దినమే - సుదినాము ।
దుర్గను - గను దినమే - సుదినాము ॥

పాదములకు - బల్
పసందైన - యా ।
పసుపు - పూతలును ।
రక్కసి కోటుల ।
నిక్కంబుగనిల ।
బిక్కు బిక్కుగా ।
స్రుక్కించెడి - మా ।
రాణిపాదముల ।
రేణువులం - గను ।
దినమే సుదినాము ॥

గమనా - హంసగమనా ।
బల్ - తళుకు బెళుకులగు ।
త్వరిత గతులతో ।
ఘందునందనక ।
చిందుల - ద్రొక్కెడి ।
ఇందు - వదన ।
అరవింద - పాద ।
శ్రీపాద - శుభద ।
నినుగను - దినమే । సుదినాము ॥

ధాత్రీ - జగద్ధాత్రీ ।
బ్రహ్మ - బీజమున ।
వీరులు - శూరులు ।
ధీరు - లుదారులు ।
పెక్కుల - గనియెడి ।
ధాత్రీ - జగద్ధాత్రీ ।
యీ పృథ్వియెల్ల ।
నీ యోనికూటమిచె ।
బ్రహ్మమయంబుగ ।

సృష్టిజేయు - యో!
క్షేత్రా - సుక్షేత్రీ।
నినుగను - దినమే సుదినామూ॥

మత్తగజము - లవి।
మత్తేభంబులు।
మర్దించుట - కు।
స్వత్తకుంభ - ములు।
గబ్బిగుబ్బలలో।
యుబ్బిన - యురమున।
అంతరంగమున।
అనంగ రంగుని।
విష్ణుతనయునిని।
తూగుటుయ్యాలలో
నిలువుగ - సొంపుగ।
నాడుచు బాడుచు!

1. పృథ్వీయోనిః - గాయిత్రి
2. విష్ణుర్హృదయం - గాయత్రి

సొగసు - జేయుమా।
మాధురి - మూర్గి।
నినుగను - దినమే। సుదినామూ॥

ధారీ - వల్లభు ప్రాణ - ధారీ।
శత్రుల జీవ - హారీ।
వల్లభుజీవమె।
సూటిసూత్రముగ।
హృదయ - రత్నముల।
నింపుగ - నదుముచు।
చిత్తమెల్ల - నీ।
చిత్తంబున - నతి।
చిత్రరీతులను।
నల్లి బిల్లిగా।
నల్లుకొన్న - యో।
మంగళసూత్ర। ధారీ।
నినుగను - దినమే। సుదినామూ॥

మోమూ -
ఇంపు గొల్పు ఆ।
తేనియలొల్కెడి।
సొంపుపెదవులును।
సత్యములోయన।
ముత్యపు పండ్లను
వెన్నునకిరవగు।
వెన్నముద్దలను।
చక్కని చెక్కులు।

నల్లనివాడగు।
నందునిపట్టితో।
రతిదేవినాథుని।
కళ్లకాటుకయు।
తెల్లని కన్నుల।
వల్లభు జేరగ।
మన్మథు బాధల।
కోర్వలేక వె।
ల్లువగా - బారెడి
బా - ష్ప - నందము।
గల - మో - మూ।
నీ - ముద్దు - మోమును।
గను - దినమే। సుదినామూ॥

పంచప్రాణముల।
నింపుగ - వీణెను।
చిణి - చిణి - చిణి - యని

3. "ప్రాణాపానవ్యానోదాన సమానస ప్రాణా" (గాయత్రి)

మీటుచు - బాడుచు।
లోకములన్నియు।
వీలగనడిపెడి - సాధ్వీ।
సరసంపు సాధ్వీ।
సావిత్రీ।
కవయిత్రీ।

నినుకౌగిట - జేర్చుక ।
వింతవింత - లగు ।
కైతల - రీతుల ।
దేవెడి - సల్పెడి ।
నిత్యానందము ।
స్వాత్యా - నందము ।
రత్యా - నందము ।
గల దినమే । సుది ॥

అంబా - రుద్రాంబా ।
హిమకరు - వాసమె
తెల్లని వన్నె ।
ముక్కంటికి - నీడగు ।
కమ్మని - కస్తురి ।
ఇమ్మగు - తిలకము ।

రుద్రునిగల యా ।
సొగసు కురులు ।
ఈ బ్రహ్మాణ్యుల - డగు ।
సుబ్రహ్మాణ్యం -
కీడగు - బుద్ధియు ।
బలము - తేజమును ।
శీలము - యశమును ।
గల - ఓ - యంబా ।
దుర్గాంబా ।
నినుగను - దినమే - సుదినామూ ।
దుర్గను - గను
దినమే - సుదినామూ ॥

4. "శ్వేతవర్ణా" (గాయత్రి)
5. "రుద్రదక్షిణా" ( ,, )

# జర్మను కథలూ, గాథలూ!

'జర్మన్ డాక్టర్'

[జర్మను ప్రజాకోటిలో ప్రచారంలో నున్న కథలూ, గాథలూ అసంఖ్యాకంగానున్నాయి. వాటిలో కొన్ని ఎంతో ప్రాచీనమైనవి మరి కొన్ని మధ్యయుగాలకి సంబంధించినవి. ఇంకా కొన్ని యీ కాలానికి సంబంధించినవి. వాటిలో జర్మను జాతి జీవితం ఎన్నెన్నో రూపాలగా ప్రతిబింబిస్తూవుండటం మనం చూడవచ్చు. ఈ కోవలో నడిచే కథలూ, గాథల్లో కొన్నిటిని "గృహలక్ష్మి"లోకానికి మా సమానమూ పరిచయం చేయటానికి పూనుకున్నాము.]

## చక్రవర్తి—వాళ్ల మేనల్లుడు

జర్మన్ చక్రవర్తులలో పేరు ప్రఖ్యాతులను గాంచిన ఫ్రెడరిక్ చక్రవర్తికి పిల్లలంటే ఎంతో ఇష్టం. ఆయన మేనల్లుడు అల్లరి పిల్లవాడు. అయితేనేం ఆ అబ్బాయి చక్రవర్తిగారిదగ్గరే అస్తమానం వుండితీరాలి. వాడు చేసే కొంటె పనులను చూస్తూ ఆనందిస్తూ వుండకపోతే చక్రవర్తికి తోచేదికాదు.

ఒకరోజున చక్రవర్తి బల్లదగ్గర కూచుండి రాజకార్యాలకు సంబంధించిన కాగితాలని తదేకదృష్టితో చూస్తూవున్నాడు. అలాటి సమయాన్నే అబ్బాయి ఆడుతూవున్న బంతి గబాలున ఆయన బల్లమీదే పడింది. చేతిలోవున్న కాగితాలని చిందరవందర చేసింది. అయినా చక్రవర్తి దానికేం కోపగించుకోక బల్లమీదపడ్డ బంతిని అబ్బాయి చేతికిస్తూ తన పని పూర్తిచేసుకున్నంతవరకు బంతిని అటుకేసి వేయవద్దని చిరునవ్వు నవ్వుతూ అబ్బాయితో అన్నాడు. అబ్బాయి ఆయన మాటను వింటేనా! బంతి తిరిగీ బల్లమీదనే పడి ఆయన చూసుకుంటువున్న కాగితాలని చెల్లాచెదరు చేయటం చక్రవర్తి చూశాడు. అబ్బాయి వాడు ఆడే ఆటల్లో కొంచెం జాగ్రత్తగా వుండటం మంచిదని గట్టిగా అన్నాడు. మూడోసారి కూడా బంతి బల్లమీదికివచ్చి అది చేయాలసిన పనిని యథాతథంగా చేసింది. ఇక అబ్బాయితో ఇంతకంటే కొంచెం కఠినంగా వుండటం మంచిదనుకుంటూ, చక్రవర్తి అబ్బాయి తన బల్లమీద పడేసిన బంతిని తిన్నగా తీసుకుని జేబులో దాచేసి తిరిగీ తన పనిలో మునిగిపోయాడు.

చక్రవర్తి ఇలా చేస్తాడని అబ్బాయి అనుకోలేదు. బంతిని ఆయనదగ్గరనుంచి ఎలా తీసుకోటం? ఇదే వాడిని కలవరపెడుతూవున్న సమస్య. ఏడుస్తే ఆయన దానిని ఇచ్చివేసాడనుకుని పుట్టి మునిగినట్లు ఏడ్వసాగాడు. చక్రవర్తి దృష్టి ఇలాటి నాటకాలకేసి పోతేగా!

తటాలున అబ్బాయి బుర్రలో ఏంతట్టిందో? చప్పున ఏడుపుని చాలిస్తూ, గబగబ చక్రవర్తికూచున్న చోటికి వచ్చి "చక్రవర్తిగారూ! ఇకనైనా నా బంతిని నాకు ఇస్తారా లేదా?" అని అట్టహాసంగా అడిగాడు.

చక్రవర్తి అబ్బాయి ఈ సాహసానికి చూసి ఆశ్చర్యపడుతూ "ఇలా అదురూ బెదురూలేకుండా, అడుగుతూ వున్నందుకు సంతోషిస్తూ వున్నాను. ఇలాటి ధైర్యసాహసాదులను పెద్దవాడివయ్యాక కూడా చూపగలిగితే నా పేరును నిలువబెట్టినవాడివవుతావు. మన దేశానికి పేరు ప్రతిష్ఠలని తెచ్చిపెట్టినవాడివవుతావు" అంటూ అబ్బాయి భుజాన్ని తడుముతూ, ఆనంద బాష్పాలని రాల్చాడు.

## కలలో బాధపడ్డ మనిషి

ఒకరోజు సాయంకాలాన ఇద్దరు బాటసారులు పరాయివూళ్ళో ఒక హోటల్లో కలుసుకున్నారు. ఆ రాత్రి అక్కడే గడపాలని వాళ్ళ కోరిక. హోటల్లో ఆరోజున ఖాళీగా వున్నది ఒకే గది. అంచేత దాన్లోనే వాళ్ళిద్దరూ బసచేయాలసివచ్చింది. హోటలు మనిషి వాళ్ళిద్దరిని ఆ గదిలోకి తీసుకుని

వచ్చి పడకని సర్ది వెళ్లిపోయాడు. ఆ మనిషి వెళ్లిపోయాక బాటసారులిద్దరూ ఆ కబుర్లు, ఈ కబుర్లు చెప్పుకుంటూ చాలాసేపు కాలక్షేపం చేశారు. ఇక పడుకోటానికి చేయాలసిన ప్రయత్నములలోకి దిగారు. మొదటాయన తన పెట్టెను తెరచి, నైటు డ్రస్సుని తీసుకున్నాడు. డ్రస్సుని మార్చుకున్నాక, స్లిప్పర్లని తిన్నగా తీసుకుని వాటిని వేసుకుంటూ వుండటం రెండో ఆయన చూసి విస్తుపోతూ "పడుకుండేటప్పుడు ఆ చెప్పులను వేసుకోటం వింతగా వుందే" అని అన్నాడు.

"దాన్లో ఏం వింతలేదు. ఒకసారి కలలో నేను ముక్కలమీద పడిపోయాను. అవి కాళ్లకి గుచ్చుకుని ఎంత బాధపెట్టాయో ఇక చెప్పాలా? అప్పటినుంచి ఈ చెప్పులను తొడుగుకుని పడుకోనటం అలవాటయి పోయింది. అలా తొడుక్కోటానికి ఎప్పుడైనా బద్ధకించానా, ఆరాత్రి నిద్ర వస్తేగా? అందుచేతనే ఇలా తొడుక్కుంటున్నాను" అని జవాబిచ్చాడు మొదటాయన తన పనిని తన మామూలు ప్రకారం చేసుకుంటూనే!

## రైతు తెలివి తేటలు

జర్మను చక్రవర్తి విల్‌హెంకు వేటాడడమంటే ఎంతో ఇష్టం. అడవి జంతువులకు పేరుగాంచిన బవేరియా అడవుల్లో ఆయన తన వేటకోసం ప్రత్యేక మందిరాన్ని నిర్మించుకున్నాడు. వారాల పర్యంతం అక్కడే బసచేస్తూ అస్తమానమూ వేటాడటంలో వుండిపోవటం ఆయనకి అలవాటయిపోయింది. ఆలాటి సమయంలో జర్మను దేశంలోని సామంత రాజులు ఆయనదగ్గర వుండిపోతూ, ఆవేటలో పాలు పుచ్చుకోటమూ పరిపాటి అయిపోయింది.

ఒకరోజున చక్రవర్తి వేటాడటంలో నిమగ్నుడై వున్న కాలంలోనే జబ్బుచేసింది. తిన్నగా తనబసకి వెళ్ళి విశ్రాంతి తీసుకోటం మంచిదనుకుని అడవి మార్గంలో అలసి సొలసి నడుస్తూవున్నాడు. సాక్సన్ రాజు, మాక్లెన్‌బర్గ్ రాజు చక్రవర్తి వెంట నడుస్తూ వున్నారు. కొంతదూరం నడిచాక చక్రవర్తి కాలు తీసి కాలువేయలేనంత స్థితిలోకి వచ్చాడు. కొంత సేపు విశ్రాంతి తీసుకోటం మంచిదనుకుంటూ ఒక చెట్టుక్రింద కూచున్నాడు. సామంతరాజులు ఆయనకి చేరువనే నిలుచున్నారు.

అలాటి సమయంలో ఆ ప్రాంతాలలోని రైతొకడు తన బండిని తోలుకుంటూ ఆ మార్గానే వెళుతూ వుండటం చక్రవర్తి చూశాడు. దాన్లో తనని కొంతదూరం తీసుకుని వెళ్లటానికి ఆ రైతుకి ఏమైనా అభ్యంతరం వుంటుందా తెలుసుకునిరమ్మని తన సామంత రాజులని రైతు దగ్గరకు పంపాడు. రైతు వాళ్ల కోరికకు తలనూపుతూ, వాళ్లందరినీ తన బండిలో కూచుండబెట్టుకుని ఆ మార్గంలోనే తిన్నగా వెడుతూ వున్నాడు.

రైతుకి వీళ్ళంత ఎవళ్ళో తెలుసుకోవాలని ఆశ. కొంతదూరం బండిని తోలుకుని వెళ్లాక, "మీరంతా ఎవరండీ?" అని వాళ్లకేసి అమాయకంగా చూస్తూ అడిగాడు.

"నేను మాక్లెంబర్గ్ రాజుని" అని ఒకాయన అన్నాడు.

ఆ మాటని విన్నాక రైతు ఆశ్చర్యపడ్డాడు. తనది నాటుబండి. మాక్లెంబర్గ్ రాజు తన బండిలో కూచోటమా? ఎంత అదృష్టం! ఎంత అదృష్టం! మాక్లెంబర్గ్ రాజు ప్రక్కనే కూచున్నాయన్ని పలకరిస్తూ "మీరెవరండీ?" అని ప్రశ్నించాడు.

"నేనా! సాక్సన్ రాజుని" అని ఆయన జవాబిచ్చాడు.

"అలాగయితే మీరెవరండీ?" అని చక్రవర్తికేసి ఆత్రంగా చూస్తూ అడిగాడు.

"విల్‌హెం చక్రవర్తిని" అని చక్రవర్తి గంభీరంగా అన్నాడు.

"మా చక్రవర్తిని, మీవంటి గొప్ప సామంత రాజులని ఇవ్వాళ ముఖాముఖిని కలుసుకోటం, మీ అందరినీ నా బండిలో తీసుకుని వెళ్ళటమూ నా అదృష్టం. ఇక నేనెవరినో మీకు చెప్పవద్దూ...... నేనా......ఆ సంగతి బయలుపరిస్తే మీరు వుక్కిరిబిక్కిరి అయిపోతారు...కాని చెప్పటం అవసరం కదూ...నా పేరు పోపు అంటారు" అని అట్టహాసంతో చెబుతూ బండిని ముందుకు అదురూ బెదురూ లేకుండా తోలసాగాడు ఆ మనిషి.

— o —

#  భరతమాత 

శ్రీ కృత్తివెంటి వెంకటేశ్వరరావు

—(౦)—

కరుణజిందుచు రాలు గరగింపజాలిన
బుద్ధదేవుడి చంకఁ మోసినావు
బహుశారద మూర్తియా ప్రభుపు
క్రీర్తను గాంచి
పసిడినుయ్యెలఁ జోల పాడినావు

గంభీరుడగు వివేకానందు ఒంగని
వేదసారపుటుగ్గు బెట్టినావు
ముల్లోకములఁ శాంతి బోధింపజాలిన
గాంధీ మహాత్ముని గాంచినావు

జగతి నేలినట్టి షట్చక్రవర్తులు
పసితనాన చుట్టు మసలుచుండ
నెల్ల శాస్త్రములను తల్లివై విడిచిన
భాగ్యశాలి నీవు భరతమాత!

మగువవై ప్రభవించి మగరూపము ధరించి
సంగ్రామ మొనరించె ఝాన్సిరాణి
ఖడ్గధారులవైరి కంఠముల్ దునిమెపీ
రవనితయైన రుద్రమ్మదేవి
వెలమబెబ్బులు లుబొబ్బిలి వీరులుగతింప
మంటల నురికెను మల్లమాంబ
పల్నాటి వీరుల పౌరుష వారాశి
నోలలాడించె మాంచాలదేవి

వీరనారీమణులు నుద్భవించి నీకు
స్థిరతరంబగు కీర్తి నార్జించుకొనిరి
మాతవై నిచ్చు నీపాల మహిమకతన,
తరమె నీభాగ్యమెన్నంగ భరతమాత!

భక్తి వైరాగ్య తత్పరత గానముజేసి
దనియించె భక్తుండు త్యాగరాజు
కాళికాదేవి సాక్షాత్కారమున కల్లు
కవితాంబు నిధిదేల్చె కాళిదాసు

వైరికంధర రక్త పంకంబు తిలకంబు
నిడెగికు దేశభక్తుడు శివాజి
జలక మాడించె నిర్మలహిమాంబువులలో
గారాలపట్టి గంగాభవాని

రహిని రవి యస్తమింపని రాజ్యలక్ష్మి!
సకలభూపులు రత్న వేదికలనుంచి
మస్తకంబున హారి నీలమణులు పోసె
వశమె నీభాగ్య మెన్నంగ భరతమాత!

ఏనాడో వనధింగమించి పరభూమీశుల్
దోరల్ వచ్చిరి
భూనాథుల్, మన భారతావని శతాబ్దుల్
వోవపాలించి, సా
లీనా కోట్లు గడించె, దర్లిరని ఢిల్లీకన్య
నీకౌగిటన్
లే నవ్వుల్ విరజిమ్ముచున్న యది తల్లీ!
భారతాంబామణీ!

రథ మొక్కమందు సారధి శౌరి యైలీలఁ
హయముల నడుప మహాత్మగాంధి
ధర్మ స్వరూపుడౌ ధర్మరాజై యుండ
సాంద్ర యశుండు రాజేంద్ర బాబు
శౌర్యార్ణవుడు సవ్యసాచియై విలసిల్ల
శాంతి దూతగుమన జవహరుండు
పంజాబు సింహంబు వాయుజుడై లీల,
వరలుచుండగ వల్లభాయ్పటేలు
రాజ తంత్రజ్ఞుడగు భోగరాజు వంశ
జలధి శశియైన పట్టాభి శౌర్యరాశి
యగు మురార్జి చెంత కవలలై వసింప
రయమునను సాగిపోవ స్వరాజ్య రథము

కొఱత కల్గునె? నీకింక భరతమాత!
శిల్ప సౌందర్యంబు చెలగునీ సదనంబు
షాజహాన్ బాదుషా తాజమహలు
ప్రకృతిశోభనుగుల్గు వాహ్యాళి యొనరించు
చెల్వంపు తలము కాశ్మీరభూమి
మానసాంబుధిఁ మంచుమలయునట్లుగ
మణివేదికైన హిమాచలంబు [జేయు
వీరభూములు జూచి వేంచేయగద్దె యా
హవణిల్లు ఢిల్లి సింహాసనంబు
వినమితోత్తమాంగుల యుర్వ్యధీశులెల్ల
బద్ధ నిస్త్రింశులయి నిల్వ పార్శ్వములను
రత్నమకుటాయముల కాంతి రాజిలంగ
సంపదలతోడ మమ్ము పాలింపవమ్మ
భవ్యగుణాన్వేత! పరిపూత! భరతమాత!



బొమ్మల కొలువు ముచ్చట

# మానవసేవలో సౌరశక్తి

శ్రీ ఎస్. పొకిదోవ్



ఈజిప్టు దేశంలో ప్రాచీన కాలంలో గానశక్తిగల ఒక విచిత్రమైన విగ్రహం ఉండేది. సూర్యోదయ మవుతున్న సమయంలో ఆ విగ్రహంలోంచి జంత్ర వాద్యంనుంచి వెలువడినట్లు స్వరాలు వెలువడుతుండే వట. కాని దానిని ఒక అద్భుతంగా పరిగణించవల సిన విషయం యేమీలేదు. ఆ విగ్రహంలో స్వరాలను పలికే యాంత్రిక యేర్పాట్లు చేయబడ్డాయి. ఒక దానితో మరొకదానికి సంబంధంగల రెండు పాత్రలు ఆ విగ్రహంలో అమర్చబడ్డాయి. వాటిలో కొంత వరకు నీళ్లు ఉండేవి. ఉదయిస్తున్న సూర్యుని కిర ణాలు ఒక పాత్రలోని గాలిని క్రమంగా వేడిచేసేవి. ఈవిధంగా వేడెక్కి వ్యాకోచించిన గాలి నీటిపైన వత్తిడిని కలుగజేసేది. అలా వత్తిడికి గురిఅయిన నీరు రెండవ పాత్రలోని నీటినీ, గాలినీ వత్తిడికి గురిచేసేది. రెండవ పాత్రలోని గాలి యీవిధంగా వత్తిడికిలోనై విగ్రహం తలలో అమర్చబడిన జంత్రవాద్యపు రంధ్రాల్లోకి ప్రవేశించేది. ఈవిధంగా ఆ విగ్రహం సూర్య "స్తవం" చేసేది.

సౌర శక్తిని మానవసేవకు వినియోగించుకోడానికి ప్రాచీన కాలంనుండి యేవిధంగా ప్రయత్నం జరు గుతూ వచ్చిందో యీ విషయం తెలియజేస్తుంది.

## సూర్యమండలపు అపార శక్తి

భూమండలం చుట్టూ 1,000 కిలో మీటర్ల మందం గల మంచుఉంటే దానిని ఒకగంటలోపల కరిగించి వేయగల ఉష్ణ శక్తిని సూర్యమండలం ప్రతి సెకం డుకు విడుదల చేస్తున్నది. కాని మన భూమండలానికి యీ ఉష్ణ శక్తిలో అతి స్వల్ప భాగం మాత్రమే (రెండువందలకోట్లలో ఒకవంతు మాత్రమే) వస్తుంది. ఇంత స్వల్పమైనదైనా అది భూమండలంమీది విద్యుత్ కేంద్రాలన్నీ కలసి ఉత్పత్తి చేస్తున్న విద్యుచ్ఛక్తి కంటే ఇరవైరెట్లు అధికం. ఇంతటి బ్రహ్మాండమైన శక్తి ప్రవాహాన్ని వినియోగించు కోవడం యెలా? సౌర శక్తిని ఇతర రూపపు శక్తి లోకి మార్చడానికి మానవుడు చేస్తూవచ్చిన ప్రయ త్నాలు బాగా పనిచేసే "కన్వర్టర్లు" లేకపోవడం వల్ల విజయవంతం కాలేకపోతూవచ్చాయి.

విజ్ఞాన శాస్త్ర, ఇంజనీరింగు రంగాలలో బ్రహ్మాం డమైన అభివృద్ధి కలిగిన యీరోజులలో మాత్రమే అది సాధ్యమవుతున్నది. సౌర శక్తిని విద్యుచ్ఛక్తి గాను, మెకానికల్ శక్తిగాను మార్చే పద్ధతులు ఇప్పుడు రూపొందింపబడ్డాయి. చలి దేశాలలో ఇండ్లల్లో వేడిని కల్పించడానికీ, సముద్రపు ఉప్పునీటి నుంచి మంచి నీటిని తయారుచేయడానికీ నేడు సౌర శక్తి ఉపయోగింపబడుతున్నది.

## "ఉష్ణ పేటికలు"

నీటిని 80-120 సెంటిగ్రేడ్ డిగ్రీలకు వేడిచేయగల "ఉష్ణ పేటికలు" ఇప్పుడు నిర్మింపబడ్డాయి. మామూలు కిటికీలకు వేయబడే గాజు పళ్ళాలతో యీ "ఉష్ణ పేటికలు" నిర్మింపబడుతాయి.

జార్జియాలోని సగర్జి అనే గ్రామంలో సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి చెందిన సౌర స్నానశాలకు సౌర శక్తితో నీటిని వేడిచేసే యంత్రం ఒకటి యేర్పాటు చేయబడింది. ఈ యంత్ర సహాయంతో స్నానశాలకు సంవత్సరం పొడుగునా వేడినీరు సర ఫరా చేయబడుతున్నది. బ్లాకులోని ఒక యంత్రా గారంలో కూడా సంవత్సరంలో ఎనిమిది మాసాల పాటు సౌరశక్తి వినియోగంతో వేడినీరు స్నానశాల కోసం సరఫరా చేయబడుతుంది. ఈ పద్ధతిలో నీటిని వేడిచేయడానికి ప్రత్యేకంగా మనుష్యులను నియమించవలసిన అవసరం ఉండదు. నీరు దానంత టదే వేడవుతుంది. పొగాకు, కూరగాయలు, పండ్లు మొదలైనవాటిని ఎండబెట్టడానికి కూడా సౌర శక్తి వినియోగింపబడుతున్నది.

సౌర శక్తిని కూడబెట్టే మరొక పద్ధతి కూడా ఉన్నది. అదే 'ఎలక్ట్రోలసిస్' పద్ధతి. అనగా నీటిని ఉదజని, ప్రాణవాయువులుగా విడదీసి భూగర్భంలో "గ్యాస్ హోల్డర్ల"లో భద్రపర్చడం. కాని యీ పద్ధతి సంక్లిష్టమయినది. కాని త్వరలోనే యీ పద్ధతి

కులభతరం అవుతుంది. ఈవిధంగా సౌరశక్తిని కూడ బెట్టి అవసరమైన విధంగా వినియోగించుకోడానికి అపారమైన అవకాశాలు యేర్పడుతున్నాయి.

## మూడవ స్పూత్నిక్ లో సౌర విద్యుద్ఘటాలు

మూడవ స్పూత్నిక్‌లో ప్రప్రథమంగా సౌర విద్యుద్ఘటాలు అమర్చబడ్డాయి. అవి స్పూత్నిక్ లోని "మయక్" ప్రసార యంత్రానికి విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తున్నాయి.

ఈ విద్యుద్ఘటాలు సౌరశక్తిని, విద్యుచ్ఛక్తిగా మార్చే అనేక "సిలికన్ ఫొటోసెల్లులు"తో కూడి ఉన్నాయి. సూర్యుని కిరణాలు దీనిపైన పడినప్పుడు విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది.

భూమండలపు వాతావరణానికి వెలుపల సౌర శక్తిని విద్యుచ్ఛక్తిగా మార్చడానికి మూడవ స్పూత్నిక్ మీద జరిగిన యీ ప్రయోగం యీ రంగంలో ముమ్ముందు జరగబోయే శోధనలకు అత్యంతంగా తోడ్పడుతుంది.

సౌర విద్యుద్ఘటాలకు గొప్ప భవిష్యత్తు ఉన్నది. కొన్ని దేశాల్లో యిప్పుడు సౌర విద్యుద్ఘటాలతో పనిచేసే రేడియోలు తయారుచేయబడుతున్నాయి.

## సౌర శక్తితో నడిచే రవాణా సాధనాలు

సౌర శక్తితో నడిచే రైలు ఇంజన్లు, నౌకలు, మోటారు కార్లను ఇంజనీర్లు నిర్మించే రోజులు సమీపిస్తున్నాయి. వీటి పైభాగాల్లో శక్తివంతమైన సౌర విద్యుద్ఘటాలు అమర్చబడుతాయి. రాత్రిపూట ఇవి పగలు కూడబెట్టబడిన శక్తితో పనిచేస్తుంటాయి.

సౌరశక్తితో రవాణా సాధనాలు నడిచే కాలం ఇంకా యెంతో దూరంలో లేదు.

## అరారత్ లోయలో సౌర కేంద్రం

సౌరశక్తి వినియోగానికి సంబంధించిన సమస్యలను పరిశీలించడానికి ఆర్మీనియాలోని అరారత్ లోయలో సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు ఒక సౌర కేంద్రాన్ని నిర్మిస్తున్నది. 1,200 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే సౌర ఉష్ణ విద్యుత్ కేంద్రం ఇక్కడ నిర్మింపబడుతుంది. క్యుబిషేవ్, బ్రత్స్క్ జల విద్యుత్ కేంద్రాలతో పోల్చినట్లయితే ఇది పెద్దదేమీ కాదు. అయినా 15,000 మొదలుకొని 20,000 జనాభాకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయగలదు.

ఈ కేంద్రం ఒక కిలోమీటర్ వ్యాసరేఖతో కూడిన వలయాకారంలో ఉంటుంది. ఆ వలయంలో చుట్టూ 1,300 అద్దాలు ఉంటాయి. అవి వలయం మధ్యనఉన్న బాయిలర్ పైకి సూర్యరశ్మిని ప్రసరింప జేస్తుంటాయి. బాయిలర్‌లోని నీరు ఆవిరిగా మారి, దాని సహాయంతో ఒక టర్బోజనరేటర్ పనిచేస్తుంది. ఆకాశం మేఘావృతమై ఉన్న సమయంలోనూ, రాత్రిపూటా కూడా యీ టర్బోజనరేటర్ పని చేయడంకోసం పగలు సూర్యరశ్మిచేత వేడిచేయబడిన నీరు భూగర్భంలో భద్రపర్చబడుతుంది.

## భవిష్యత్తులో సౌరశక్తి వినియోగం

త్వరలోనే సోవియట్ దేశమంతటా సౌర విద్యుత్ కేంద్రాలు నెలకొల్పబడుతాయి. సౌర విద్యుచ్ఛక్తి వినియోగంతో రవాణా సాధనాలు ప్రజలను ఒకచోటునుండి మరొక చోటుకు చేరుస్తాయి. సౌర విద్యుచ్ఛక్తితోనే బల్బులు వెలుగుతాయి. టెలివిజన్ సెట్లు పనిచేస్తాయి. రోదసీ నౌకలలో సౌరశక్తి వినియోగించుకోబడుతుంది.

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

౮౦

త్రిభువన శత్రువై - దిరిగిన రావణుఁ
జెగటార్చి, శ్రీరామ! ధీసమేత!
వామహస్తమునఁ జాపము, భూమిపై నిల్పి
బాణంబుఁ గుడిచేతఁ బట్టి; త్రిప్పు
చున్నావు-ముదముతో నున్నావు; నీ కన్ను
లెఱుపు కాంతి వహించె నిందిరేశ!
కాయంబు నందెన్నొ-గాయముల్ గన్పడె,
కోటి భాస్కర తేజ! కువలయేశ!

వీరలక్ష్మీ మనోహరాకార! శూర!
ఇంద్రుడెప్పుడు నిను స్తుతియించు చుండు
వీరరాఘవ! శ్రీ పతి! వినుతి సేతు;
రక్షసలుపుము; శ్రీరామ! రాఘవేశ!

౮౧

శస్త్రాస్త్రములతోడ సన్నద్ధుఁడై, వీర
వానరావళికెల్ల భయముగొల్పి
క్రోధస్వరూపుఁడై - రూక్షవీక్షణములు
నిప్పులు గురియంగ నేలమీద
నట్టహాసముతోడ నరుదెంచు, కుంభక
ర్ణుని, నేక బాణంబు ననువధించి
సురకపి సంఘంబు శోభిల్ల, ముదముతో
మునులు నిన్ బూజింప ముద్దుగాగ
వీరరాఘవ! శ్రీ పతీ! వెలసినావు
వీరలక్ష్మీ మనోహరాకార! శూర!
ఇంద్రుఁడెప్పుడు నిన్ను స్తుతించుచుండు
రక్షసలుపుము శ్రీరామ! రాఘవేశ!

౮౨

రాక్షసోన్నతుండయి - రూక్షబాణాగ్ని చే
భీషణమూర్తియై - వెలయువాఁడు
సేవకావళిచేత - సేవింపబడువాడు
ఘోరనాదము సేయు క్రూరుఁడెల్ల
దిక్పాలకాళి వేధించు కఠోరుండు
లంకాధినాథుండు-రావణుండు
శ్రీరామ! నీ చేత శివసన్నిధిని జేర

మిత్ర బాంధవుల సమేతుఁడగుచు
దిక్పతులు, భోగభాగ్యమందిరి; ద్విజులు
ను తులుసల్పిరి; శ్రీపతీ! స్తుతినొనర్తు;
వీరలక్ష్మీ మనోహరాకార! శూర!
రక్షసలుపుము; శ్రీరామ! రాఘవేశ!

౮౩

కౌసల్య శ్రీమాత గర్భాబ్ధిలో నీవు
పూర్ణచంద్రుండవై - పొడమినావు
మానీ విసర్మల - మానసాంభోజముల్
వికసింప సూర్యుఁడై - వెలసినావు,

ధార్మిక గుణములో - ధర్మరాజునుబోలి
ధర్మాత్ముఁడై నీవు - దనరి నావు
మారీచు, బాణాగ్నిచే రూపుమాపిన
శౌర్యధనుండవు - సచ్చరిత్ర!
వీరలక్ష్మీమనోహరాకార! శూర!
ఇంద్రుఁడెప్పుడు నినుఁ స్తుతియించుచుండు
వీరరాఘవ! శ్రీ పతీ! వినుతిసేతు
రాక్షసలుపుము; శ్రీరామ! రాఘవేశ!

౧౪

దండకారణ్యమందు, కోదండరామ!
తిరిగి, రాక్షసమూకల తీక్ష్ణ బాణ
తతులసంహార మొనరించి - వెతలమాన్పి
నావు; గజతుండములఁబోలి - చేవఁగల్గి
నట్టి - నీభుజదండము లట్టిగాంచి
శత్రుమూక - భీతిల్లి నాశనము బొందె
వీరలక్ష్మి మనోహరాకార! శూర!
శ్రీ పతీ! రామచంద్ర! రక్షింపుమయ్య!

౧౫

సుకుమార దేహులు - సుందరాకారులు
బలపరాక్రమములఁబరగువారు
పుండరీకంబులఁబోలు గన్నులవారు
శాంతులు ధర్మవిచారపరులు
ఫలమూలభోజనుల్ - వల్కలధారులు
తరుణులు దైత్యమర్దనులు ఘనులు
వీరులు, శ్రీధనుర్ధారులు, దశరథ
పుత్రులు, సుగుణ పవిత్రులమర
సంస్తుతులు, వేదవేద్యులు - పారమతులు
మాననీయులు, రామలక్ష్మణుల పూర్వ
సోదరులు, భక్తజనులకు శుభములొసఁగి
విజయులగుదురు; వారల వినుతిసేతు.

౧౬

పాపాటవిని, రూపుమోపెడి దహనంబు
పావనంబుల మేటి పావనంబు
ధర్మవృక్షమునకు - ధరణిలో బీజంబు
జీవనంబులకెల్ల జీవనంబు
అఖిల శుభంబుల కాదికారణము మో
క్షస్థానమును జూపు కలిమిబాట
పాంథావళికి దారి బత్తెంబు; కవివరుల్
స్తుతియింపఁజాలరు పతితమంత్ర
మరయ శ్రీరామ నామంబు దురితహరము
చింతసల్పెడువారికి శ్రీకరంబు
బుద్ధి మాంద్యంబుఁ బోగొట్టుశుద్ధిమంత్ర
మట్టి మంత్రంబుఁ బ్రార్థింతు నహరహంబు

౧౭

దశరథు ముఖపద్మ దళము వికసనము
సల్పుసూర్యుండు; కౌసల్యమాత
కలువకన్నుల విప్పు చలువలరేడు; శ్రీ
జానకీ మానస సరసునందు
విహరించు హంసంబు; వినుతయశోమూర్తి
రాజిత పద్మనేత్రములుగలుగు
ఆజానుబాహుండు - యఖిలలోకంబుల
రక్షణ సలిపెడు దీక్షయుతుఁడు
దీనవత్సలుండు - దిక్కులేనట్టి వా
రలకు దిక్కు; ప్రేమగలుగువాఁడు
దశరథాత్మజుండు ధర్మాత్ముఁడనయంబు
మమ్ముఁ బ్రోచుగాత! మమతతోడ.

(సశేషము)

---



# ఫలించని ప్రేమ

శ్రీ ఎస్. ఎమ్. వాడ్రేవ్

స్టేడియం హోటల్లో గోపాలం, రమేశం, పంచాక్షరి, ముగ్గురూ రౌండు టేబిల్ ముందు కూర్చుని కాఫీ త్రాగుతున్నారు.

"ఒరేయ్ బడుద్ధాయిలూ! వెంకటేశం రాలేదేరా?" పెద్ద గొంతుకతో అరిచాడు పంచాక్షరి.

వెంకటేశం కిస్సురు మనకుండా వెనకాతలే వచ్చి నాలుగో కుర్చీలో కూలబడ్డాడు. యిది పంచాక్షరి చూడలేదు.

"పంచాక్షరీ! నువ్వేమీ బెంగపెట్టుకోక్కర్లేదురా బ్రదర్. నాలుగో బ్రదర్ వచ్చాడు" నవ్వుతూ రమేశం అన్నాడు.

"ఒరే! పంచాక్షరీ మొనగాలైన మిత్ర బృందమా! నేను గొప్పపని చేశేసాను." నాందీ ప్రస్తావన ఉపన్యాసానికి.

"ఏమిట్రోయ్! త్వరగా చెప్పు. నాకూ వీలయితే నేనూ చేస్తాను." అంటూ ఖాళీ కాఫీ కప్పు టేబిలుమీద పెట్టాడు, గోపాలం.

"గోపాలం! ఆపని నేనుతప్ప మరెవ్వరూ చేయలేరురా! అది నాలాటివాడే చెయ్యాలనుకో!" ప్రగల్భాలు పలికే వెంకటేశం.

"ఏమిట్రా?"

"ప్రేమ-ప్రేమరా! లైలా-మజ్నూలకన్న మించిపోయిన......"

"ఆ!" అని మిగిలినవాళ్లందరూ నోళ్ళకి గాడ్రెజ్ తాళంకప్పలకు పని కల్పించారు. తరువాత అందరూ ఒక్కసారిగా తేర్చారు.

"ఎవరినిరోయ్?"—గోపాలం.
"ఎలాగుంటుంది?"—రమేశం.

"ఎలాటి చీర కట్టింది - నాకు తెలుసుకోవాలని"—పంచాక్షరి.

"నోరు ముయ్యండి. అలా వర్షపు చినుకులు పడ్డట్లు అడిగేస్తే నేను ఉక్కిరి బిక్కిరైపోయి చావాలి!"

"అయితే చెప్పు" ముగ్గురూ మెల్లిగా అన్నారు.

"మాట్లాడకండి." పెద్ద తనేదో చెప్పేసేటట్టు సర్దుకుంటూ కూర్చున్నాడు గోపాలం.

వెంకటేశం ప్రారంభించాడు:

"ఓడియన్‌లో కాఫీ త్రాగి బస్సుస్టాపుకి వచ్చేనురా! అక్కడే నాప్రక్కన ఒకావిడ—అదే ఒక అబల అనుకోండి, సరిగ్గా పదహారేళ్ళుంటాయి. ఎర్రటి బ్లౌజు, తెల్లటి సిల్కుచీర, బాటా హైహీల్స్ చేతిలో లెదర్ బాగ్, గులాబీవంటి కళ్ళకి నీలిరంగు చలవ కళ్ళజోడు. ఈ ఆకారాన్ని చూచేసరికి నా ఆత్మ ఒక్కసారి అరచినట్లయింది.

నేను ఆమె వైపు చూశాను. ఆమె నా వైపు చూసింది. చూపులు కలిశాయి. ఆమె నావైపుచూసి కనుసైగ చేసింది. అప్పుడు అదేదో సినీమాలో హీరో హీరోయిన్లు "చూపులు కలసిన శుభవేళా! ఎందుకు నీకీ పరవశమూ!" అని పాట డ్యూయట్లు పాడుకున్నారు గదూ—అది జ్ఞాపకం వచ్చింది. నాకు భయమేసింది. స్టాపుదగ్గర చాలమంది వున్నారు. ఓస్! అమ్మాయి పిలుస్తుండగా నేను వెళ్లకపోవడమేమిటి. "ధైర్యే సాహసే ..." అని ఏదో అంటారే అలాగనుకుని ఆమెదగ్గరకు నిర్భయంగా చేరాను,

"మీరెక్కడకు వెడుతున్నారు?" అని ప్రశ్నించింది. నాగుండె 'తా' అంది. ధైర్యం తెచ్చుకుని పజ్జన్‌సింగ్' పార్కుకి అని అబద్ధమాడాను.

"నేనూ అక్కడికే" అంది.

"అబ్బే! అక్కడకు వెళ్లనులెండి. టైమయింది. లోడీకాలనీ మార్కెట్టుకి వెళ్లాలి." అన్నాను.

మళ్లీ; "నేనూ అక్కడికే" అంది. ఎలారా బాబూ తప్పించుకోవడం అని ఆలోచించాను ఆ

అమ్మాయిని ప్రేమించి పారేస్తే ఏ గొడవావుండదని మెల్లగా ఆమెదగ్గరకు జరిగి ఆ చల్లని చేయి పట్టుకుని మాపశాను 'సి' క్వార్టర్‌లోవుంది. కాఫీకిరావాలి! అన్నాను.

"ఆమె నవ్వి మాయింటికికూడా కాఫీకిరావాలి." "తప్పకుండా వస్తా" నన్నాను.

"పేరు సుమిత్రట. ఎంత బాగుందనుకున్నారు. ఈ లోపున బస్సువచ్చింది. కండక్టర్ ఒక్కసీటు వుంద న్నాడు ఏంచేస్తాం. ఆమె వెళ్లనంది. యిద్దరంకలసి స్కూటర్ లోడి కాలనీకికుదుర్చుకుని వెళ్లాం. అక్కడి నుంచి వెళ్లేటపుడు మార్నింగ్ నే కాఫీకి రావాలంది." అని ముగించాడు, వెంకటేశం. ముగించే సమయంలో గోపాలం ముక్కబ్రద్దలయేటట్టు తుమ్మాడు.

"ఈశుభకార్యం ఎలాముగుస్తుందో, గోపీగాడు తుమ్మాడు" నవ్వుతూ పంచాక్షరి అన్నాడు. !

"చాలా అదృష్టవంతుడు" రమేశం అన్నాడు.



వెంకటేశం ప్రతిరోజూ 8 గం॥కి లేచేవాడు. ఆ రోజు 6.30 కి అలారం పెట్టుకుని మరీలేచాడు. తన కున్న మంచిబట్టల్లో షార్క్‌స్కిన్ బుష్‌షర్టు; న్యూషరాక్ ఫ్యాంటుతొడుక్కున్నాడు. ఎప్పుడూ పౌడరురాసుకోనివాడు నిన్నసాయంత్రంవచ్చేటపుడు పాండ్స్‌పౌడరు కొనుకున్నాడు. మిసాలుపార్ట్ చేశాడు. తలపైకిదువ్వాడు. కాళ్లకి బాటాహవాయి జోళ్లు తొడిగాడు.

మంచి శకునంచూసుకుని బస్టాపుకి వచ్చాడు. బస్సెక్కి Lodi colony లో దిగాడు. 'C' బ్లాకు దగ్గరకువచ్చి '28' నెంబరు రూమ్ Calling Bell Switch నొక్కాడు. ఎవరోవచ్చి తలుపుతీశారు. నిన్న సాయంత్రంకనబడ్డ తన ప్రేయసి కాదు. ఆశ్చర్యపోయాడు. తనస్నేహితుడు. ఎవరోకాదు. కథాగమనమంతా సవివరములతో చెప్పించుకుని విన్న గోపాలం. కొంపదీసి ఈ యిల్లు కాదుగద.

వెంకటేశం అట్లానిలబడిపోవడం గోపాలం చూసి "ఏరా !అలాచూస్తావు ? నేను గోపాలాన్ని లోపలికిరా !" అన్నాడు.

వెంకటేశంతేరుకుని "ఆఁ! ఏం లేదు నీ Zoology Text ఉంటే ఒక పారియియ్యి" మాటలు మార్చే శాడు.

"ఏం నీదేమయింది."

"రాత్రిరమేశం తీసుకున్నాడు."

"అయితే యిస్తా. కాఫీ తాగేవా ?—అన్నట్టు నిన్న సాయంత్రం ... "

"ఆఁ ! అదే పదిగంటలకు వెడతా"

"సుమిత్రా ! రెండుకాఫీలు పట్టుకురా" అని తన చెల్లెల్ని పిల్చాడు. 'సుమిత్ర' అనే సరికి వెంకటేశానికి ఎందుకోభయంవేసింది. యింతట్లో-

ఎర్రటి బ్లౌజు, తెల్లటి సిల్కుచీర కట్టుకున్న అమ్మాయి ట్రేలోరెండుకాఫీ కప్పులతో వచ్చి అక్కడ కప్పులుపెట్టి వెళ్ళిపోయింది. గోపాలానికి చుట్టాలు కాదుగదా ! వెంకటేశం గుండెల్లోరైళ్లు-విమానాలు పరుగెడుతున్నాయి. సాయంత్రం కన పడ్డ అమ్మాయే.

"అమ్మాయి గురించి ఆలోచిస్తున్నావేమిటోయ్ త్వరగా కాఫీత్రాగి వెడుదువుగాని. ఎదురుచూస్తూ వుంటుంది." అన్నాడు గోపాలం.

ఈ మాటలు వింటున్న వెంకటేశం యాష్ ట్రేలో పడెయ్యవలసిన సిగరెట్టు ముక్క కాఫీకప్పులోముంచే శాడు. గాలుక్కరుచుకున్నాడు. యిదంతాచూస్తున్న గోపాలం నవ్వుకున్నాడు. ఇంకో కాఫీ తెప్పించి యిచ్చాడు. వేడిగా నున్నా గబగబా త్రాగేశాడు.

ఖాళీకప్పులను తీసికెళ్లడానికి అమ్మాయివచ్చింది "మా చెల్లాయిని ఎప్పుడూ చూడలేదు. పుస్తక నెపంతోనయినా వచ్చావు. యిదిగో" అని చెల్లి అని చూపించాడు.

యిద్దరూ ఒకరినొకరు నమస్కరించుకున్నారు. ఒకకంటితో అమ్మాయి తననుచూచినవ్యంగ్యంచూశాడు. పళ్ళుపటపట కొరుక్కున్నాడు.

వెంకటేశం యిద్దరికీ 'Good bye' చెప్పి బోనులోనుండి బయటపడ్డపులిలాగ వచ్చేశాడు.

"ప్రేమలంటే యిలాగే వుంటాయి కాబోలు" అను కున్నాడు.

"నా జీవితబ్రతుకింతేనా" అనే రికార్డు ప్రక్క నున్నగ్రామఫోనుల షాపులోనుండి వినబడ్తోంది.






# సాహసవీరులు

**శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు**

(గతసంచిక తరువాయి)

"అది కాదమ్మా, నేను రాక్షసుడిని కాదు. నీ వలె నేనుకూడా వంచింపబడినవాడినే. వాడిని నమ్మించి యిలా వచ్చాను. నీకేం భయంలేదు. నిన్ను విడిపించి నీ యింటికి పంపేభారం నాది. నన్ను నీ సోదరుడుగా ఎంచుకో తల్లీ—!" అన్నాడు శివబంటు.

ఆమె ఆశ్చర్యపోయింది. "అయితే ఎవరు నువ్వు?" అని అడిగింది.

శివబంటు జరిగినదంతా చెప్పి— "ఈ రాక్షసుడు నిన్ను పెళ్లి చేసుకునేందుకు ఒప్పించటానికి రాయభారంగా నన్ను పంపాడు. నేను సరేనని ఇలా వచ్చాను!" అన్నాడు.

"అయితే నన్ను రాక్షసుడికి పట్టించటానికి వచ్చావా!" అంది భయంగా.

"అది కాదమ్మా! వాడిని హతమార్చే వుపాయం ఆలోచించమంటున్నాను. అన్నట్లు నీ పేరేమిటన్నావ్?"

"నా పేరు రమణి. నాది ఉజ్జయినీనగరం. నా తండ్రి పేరు శంకరప్రభు. మేము ఇద్దరక్కచెల్లెళ్లం. మేమిద్దరం ఉద్యానవనంలో ఆడుకుంటుండగా ఈ రాక్షసుడు సుడిగాలి రూపం ధరించి మామీదికి వచ్చాడు. అంతే కండ్లు తెరిచేటప్పటికి నేను ఇక్కడున్నాను మా అక్క స్వరూపం ఏమైందో!"

"విచారించకు రమణీ! నేనొక చిన్న వుపాయం చెప్తాను. వాడిని ఇక్కడకు పంపిస్తాను. ఎలాగో వాడిని బోల్తాపుచ్చి ప్రాణరహస్యం కనుక్కో. ఆ పైవిషయానికి నేనున్నానుగా!"

"సరే" నంది రమణి.

శివబంటు పైకివెళ్లి చాటంత మొహంతో "మిమ్మల్ని రమ్మంది!" అన్నాడు. 'భేష్! నమ్మినబంటువంటే నీవు. పద!" అంటూ లోపలకు వచ్చాడు. శివబంటు గది బయట నిలబడి వున్నాడు. అట్టహాసుడు లోపలకు రాగానే స్వాగతమిచ్చింది. ఆమె ప్రేమనుచూసి రాక్షసుడు పొంగిపోయాడు. "ఇంతకాలం మీ స్వరూపం కన్నులార గాంచికూడా జాగుచేసినందుకు నన్ను నేనే నిందించుకున్నాను. ఈనాటికి భగవంతుడు బుద్ధిచెప్పాడు. మీమీద నాకు ఆశ కలిగింది—!" అంది.

ఆ తరువాత ఫలహారాలతో పరితృప్తుని చేసింది.

"ఈ రాత్రి ఇక్కడే పండుకోవాలి సుమా!" అంది.

"అంతకంటేనా!" అని ఎగిరి గంతేశాడు.

పొరపాటున్నాను. ఈ ముండాకొడుకు ఇక్కడే తగలడడు కదా అని యనుకొని "అది సరే కాని మీ చేతిలో ఆకర్ర ఏమిటి?" అని అడిగింది. "అది విజయదండం. ఈదండం చేతునున్న వారికి అపజయం రాదు సరికదా ఇంకొక గమ్మత్తువుంది. ఇదిపుచ్చుకొని మనసులో ఏ రూపం కావాలని తలుచుకుంటే ఆరూపం పొందవచ్చు.!" అన్నాడు.

"అలాగా! జాగ్రత్త సుమండి. పరాగ్గా నిద్రపోతే మీ ప్రాణాలెవరైనా కాజెయ్యగలరు!" అంది.

(సశేషము)

# విధి వైపరీత్యం

శ్రీ పురాణపండ కామేశ్వరరావు

చిట్టడవి నట్టనడుమ
దట్టమైన పొదలమధ్య
పుట్టలోన ఫణిరాజు
గుట్టుగాను ఉంటుండె.

పుట్టప్రక్క చెట్టుగలదు
చెట్టుమీద ఒకపిట్ట
పిట్టను కొట్టగ ఎరుకడు
గట్టిగాను గురిపెట్టెను

దిట్టమైన బోయవాడు
పిట్టను కొట్టగ నిలచి
పుట్టమీద కాలునిలిపి
కొట్టబోయె పిట్టనతడు

కొట్టబోయను చూచి
పిట్ట ఎగురబోవ సాగ
కట్టెదుటేడేగ యొకటి
నిట్టనిలువ యెగురసాగె

కొట్టనున్న బోయవాని
పిట్టచూసి కళ్లుమూసి
గట్టిగాను మనసులోన
పుట్టించిన శివుని దల్చె.

పిట్టను కాపాడ దల్చి
పుట్టలోని పాము నతడు
కొట్టబోవు బోయవాని
పట్టి కరువమని పంపె

పుట్టలోని నాగరాజు
పుట్టపైకి ప్రాకి వచ్చి
పట్టి బోయవాని కాలు
గట్టిగ కరచెను పాము

కాటుతిన్న బోయవాడు
పుట్టపైన బాణముంచి
ఇట్టె బోయె కూలిపోయె
బుట్ట క్రింద పడవైచుచు

పిట్టను కొట్టే బాణం
కొట్టెను డేగను పోయి.
గట్టిగాను తగులగాను, డేగ
పిట్ట నేల కూలె

చూశారా బాలలూ:-కన్నారా బాలికలూ శరణాగత రక్షణనూ శ్రద్ధగాను విన్నారా!



# విశ్వాసపాత్రుడు

శ్రీ చందవరపు సేతుమాధవరావు

అవి రూపసేనుడు బుర్ద్వాన్ రాజ్యమును పరిపాలించే రోజులు. ఒకనాటి ఉదయం ఒక రాజపుత్ర యువకుడు రాజుకడకు వచ్చెను. అతనిపేరు బీర్‌బల్. వచ్చి "మహారాజా! నేనుగూడా అందరిలాగానే మీదగ్గర ఏమైనా పనిచేయటానికని భార్యాబిడ్డలతో వచ్చాను. నన్నుగూడ దయఉంచి పనిలోకి తీసికొనండి రాజా!" అనెను. అదివిని రూపసేనుడు "నీకెంత జీతమివ్వ మంటావ్?" అనెను. "ప్రభూ! రోజుకు వెయ్యితులాల బంగార మిప్పించండి" అనెను. ఇది విని సభవారందరు ఆశ్చర్యపడ్డారు. రాజు తన సర్వసైన్యాధ్యక్షుడికే అంతజీత మివ్వడాయె! కాని రాజు అతడి ముఖములో ఒక విచిత్ర వర్చస్సును గమనించి "సరే! నిన్ను పనిలోకి తీసికొంటాము. ప్రస్తుతము నెలరోజు లుంచుకొని, నీచేపనికి పనికివస్తే దాంట్లోకి తీసికొంటాము" అన్నాడు. రాజు రోజూ బీర్‌బల్‌కు వెయ్యితులాల బంగారమిమ్మని ఆజ్ఞాపించాడు.

బీర్‌బల్ తనకు రోజూవచ్చే వెయ్యి రూపాయలలో 500 రులు యాత్రికులకు, అతిథులకు ఖర్చుపెట్టేవాడు. మిగిలిన 500 రు లలో 250 రులు తన కుటుంబానికి మిగిలిన 250 రులు కుంటి, గ్రుడ్డి మొదలగువారి నుద్ధరించుట కొఱకు ఖర్చుపెట్టేవాడు. బీర్‌బల్ ప్రస్తుతము రాజుదగ్గర ఉంటూఉండి అతడు చెప్పే పనులన్నిటిని చేస్తున్నాడు.

ఇలా ఉండగా ఒకనాటి రాత్రి ఒక చిత్రమైన సంఘటన సంభవించింది. రాజు, బీర్‌బల్ రాత్రిపూట ఎవరో ఏడుస్తున్నట్లుగా రోదనాన్నిబట్టి గ్రహించారు. రాజు అదేమిటో కనుక్కొని రమ్మని బీర్‌బల్‌ను పంపాడు. ఇపుడు బీర్‌బల్ శక్తిసామర్థ్యాలు, విశ్వాసపాత్రత కనుగొనటానికి రాజుకు సదవకాశం.

చ్చింది. వెంటనే నల్లని దుస్తులు ధరించి బీర్‌బల్‌ను అనుసరించాడు.

ఆ రోదన ధ్వని స్మశానభూమినుంచి వస్తున్నది. బీర్‌బల్ అచటికి వెళ్ళొక వనితను చూచాడు. చూచి "ఏమ్మా! ఎందుకేడుస్తావు. చెప్పు" అన్నాడు. అందుకు "నేను రాజాయొక్క అదృష్టదేవతను. నేడు దేశంలో అరిష్టమూలైన పనులు జరుగుతుండుటవల్ల రాజా కొద్దిరోజుల్లోనే మరణిస్తాడు. అందుకని ఏడుస్తున్నాను" అన్నది. "మరి దీనికి మీ నివారణోపాయము లేదా?" "ఉన్నది. నీవు నీకుమారుని కాళికాదేవికి బలి యిచ్చేటట్లయితే రాజా శతాయుష్మంతుడగుతాడు" అని అదృశ్యమయింది.

వెంటనే బీర్‌బల్ యింటికివెళ్ళి సుఖంగా నిద్రిస్తున్న భార్యాబిడ్డలను లేపి సంగతంతా చెప్పాడు. పిల్లవాడు రాజాకొఱకు ప్రాణాలర్పించటానికి సంతోషపూర్వకంగా ఇష్టపడ్డాడు. తల్లి సంతోష హృదయంతో అంగీకరించింది.

వాళ్ళ అంగీకార సూచన ప్రకారమే కాళికాలయానికి భార్యాబిడ్డలతో వెళ్ళాడు బీర్‌బల్. "రాజా శతాయుష్మంతుడు కావాలని" ప్రార్థించాడు. తర్వాత కత్తి తీసికొని బీర్‌బల్ తన కుమారుని తల నరికాడు. ఇది చూచింది బీర్‌బల్ కూతురు. సోదర మరణాన్ని చూసి సహించలేక కత్తి తీసికొని పొడుచుకొని పడిపోయింది. సోదరి, కొడుకు కూతురులేని జీవితం వ్యర్థమనుకొని బీర్‌బల్ భార్య తనను తాను చంపుకొన్నది. తన ఎదుటనే మూడు శవాలను చూచాడు బీర్‌బల్. తన జీవితంలో చేయవలసిన దేమీ లేదనుకొని కత్తి తీసికొని పొడుచుకొని మరణించాడు.

ఇదంతా చాటునుండి కనపడకుండ వచ్చిన రూపసేనుడు చూచాడు. తనకోసం ఒక సంసారం నాశనమయి పోయింది. రాజభక్తులంటే వాళ్ళే ననుకొన్నాడు. వాళ్ళులేని రాజ్యం వ్యర్థమనుకొన్నాడు. వెంటనే కత్తి తీసికొన్నాడు. ఇంతలో కాళికాదేవి ప్రత్యక్షమయింది. ఆతడి ధైర్యానికి మెచ్చి "బీర్‌బల్‌ను, అతడిభార్యాబిడ్డలను బ్రతికిస్తా"నని చెప్పింది. ఇదివిని రాజా సంతోషపడి ప్రక్కకు వెళ్ళి దాగుకొన్నాడు. బీర్‌బల్, ఆతని భార్యాబిడ్డలు నిద్రనుండి లేచినట్లు లేచారు. లేచి ప్రార్థనచేసి యింటికి వెళ్ళారు.

మరునాటి ఉదయము రాజా "బీర్‌బల్! రాత్రి వినవచ్చిన ధ్వని ఏమిటి?" అన్నాడు. బీర్‌బల్ ధైర్యవంతుడు, విశ్వాసపాత్రుడే గాక సాధుస్వభావి. తను చేసినపనికి తను పొగడుకొనలేదు. "అది ఏమి లేదు రాజా! ఎవరో స్మశానభూమి దగ్గర ఏడుస్తున్నారు. నేను వెళ్ళగానే వారు అదృశ్యమయినారు" అనెను.

రాజు ఇదివిని ఆతడి గొప్పతనమునకు విస్మయమందెను. మరుదినమే సభ నేర్పాటుచేసి క్రితము రాత్రి జరిగిన సంఘటనను సభవారికి దెల్పెను. అంతేగాక ఆతడికి అశేష బహుమతుల నిచ్చెను. రాజ్యమేలు కొనుటకై ఒకరాష్ట్రము నిచ్చెను. బీర్‌బల్ దాన్ని పరిపాలించుతూ భార్యాబిడ్డలతో హాయిగా కాలము గడిపెను.

# సాయినిలయంలో

# శ్రీ సాయిబాబా మహాసమాధి దినోత్సవం



మద్రాసు షెణాయ్‌నగర్‌లో శ్రీ సాయిబాబా భక్తసమాజం యాజమాన్యమున సాయినిలయంలో 10, 11 తేదిలలో మహాసమాధి దినోత్సవము అత్యంత వైభవముగా జరిగెను. 10వ తేదినాడు రెండువేల మందికి పైగా బీదలకు అన్నప్రదానము జరిగెను. విజయదశమినాడు మధ్యాహ్నము 5 గం॥ల నుండి శ్రీమతి కే. జానకి ప్రక్క-వాద్యములతో భక్తిగీతములు పాడి భక్తకోటిని తన్మయులుగా చేసెను.

రాత్రి 7 గం॥లకు మద్రాసు హైకోర్టు రిటైర్డు జడ్జి శ్రీ W. S. కృష్ణస్వామి నాయుడుగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగెను. శ్రీ త్రిపురసుందరి ప్రార్థన గీతముతో సభ ప్రారంభమాయెను.

సమాజం చైర్‌మన్ శ్రీ రామానుజాచారిగారు సభికులకు స్వాగతము చెప్పుచు చాలకాలంగా శ్రీ బాబా పూజారాధనలు, సేవాకార్యక్రమము సాగించుచున్న శ్రీ స్వామి కేశవయ్యాజీకి జోహారులర్పించుచు యీ కార్యక్రమముల నిర్వహణకుగాను సాయినిలయమున కెదుటనున్న ఆవరణనుపొంది మందిర నిర్మాణము ఉద్దేశించబడినదనియు, అందుకుగాను భక్తుల సహాయసహకారములను సేకరించుటకు శ్రీ సాయిబాబా భక్త సమాజం రూపొందినదనియు, భక్తులందరు సమాజం కృషికి తోడ్పడి శ్రీ సాయిమందిరము త్వరలో నిర్మాణ మగునట్లు చూడవలెనని విజ్ఞప్తి చేసిరి.

శ్రీ పురుషోత్తంగారు, M.L.C. మాట్లాడుతూ శ్రీ స్వామి కేశవయ్యాజీ పూజారాధనలతోటి, సేవా కార్యక్రమములతోటి అనేకమంది దీనుల నుద్ధరించుచున్నారనియు, శ్రీ సాయిమందిర నిర్మాణ ప్రయత్నంలో తాము శక్తివంచన లేకుండా కృషి చేయుచున్నామనియు, త్వరలో తమ ప్రయత్నములు ఫలించగలవని విశ్వసిస్తున్నామనియు చెప్పిరి.

శ్రీ టి. చెంగల్వరాయన్‌గారు మాట్లాడుచు యీనాటి వాతావరణంలో మానవుని నైతిక పునరుద్ధరణకు యిలాటి సమాజములు, కార్యక్రమములు అవసరమనియు, శ్రీ స్వామీజీ నిర్విరామంగా దీనజనోద్ధరణకు చేయుచున్న కృషి అమూల్యమైనదనియు, త్వరలో శ్రీ సాయిమందిర నిర్మాణము జరుగగలదని ఆశిస్తున్నామనియు చెప్పిరి.

శ్రీ కే. యస్. రామస్వామి శాస్త్రిగారు ఉపన్యసిస్తూ శ్రీ సాయిబాబా సమాధి ఎప్పటికప్పుడు భక్తుల మొరలను ఆలకిస్తూ ఉద్ధరించుచున్నదనియు, శ్రీ సాయిబాబా జీవితము, బోధనలు మానవులలో పరస్పర సద్భావ, సానుభూతి సహకారములను, ప్రేమ, భూతదయను ప్రోత్సహించి ఆత్మవిశ్వాసమును, ఆత్మ పరమాత్మల జ్ఞానమును పూరించుచున్నవని తాము సాయిభక్తుడుగా శ్రీ సాయిబాబా ప్రతినిధిగా నొప్పుచున్న శ్రీ స్వామి కేశవయ్యాజీతో తనకుగల అనుభవమును వివరించిరి.

శ్రీ జె. వి. సోమయాజులుగారు ఉపన్యసించుచు తమకు అనేకమంది సాయిభక్తులతో పరిచయమున్నదనియు, శ్రీ సాయిబాబా పట్ల భక్తివిశ్వాసములతోబాటు శ్రీ స్వామి కేశవయ్యాజీ దివ్యసందేశమునందలి సూత్రముల ననుసరించి, ఆచరణలో పెట్టుటవలన మానవకళ్యాణం మరింత సుగమం కాగలదని చెప్పి, యీనాటి సంక్షోభ పరిస్థితులలో శ్రీ స్వామి కేశవయ్యాజీ లాంటి దివ్యపురుషుల మార్గదర్శకత్వము, ఆధ్యాత్మిక, పారమార్థిక తత్వముల ప్రచారము, సేవాకార్యక్రమములు మానవుని దివ్యత్వమునకు, శాంతి సౌభాగ్యములకు అత్యవసరములనిరి.

శ్రీ స్వామి కేశవయ్యాజీ తమ దివ్యసందేశమును పూరించి శ్రీ సాయిబాబా బోధనల జీవితచరిత్రను నుసరించి యిహపరసౌఖ్యాల పొందనగుననియు, శ్రీ సాయిబాబా భక్తసమాజంలో చిత్తశుద్ధి, భక్తివిశ్వాసలు గలవారి సంఖ్య పెద్దది కాకపోయినా కొద్దిమంది సభ్యులతోనైనా అమూల్యమైన కృషి సలుపనగుననిరి. పూజారాధనలు, ఉత్సవాల సందర్భమున అధికార, అనధికారుల సహాయమునకు కృతజ్ఞత తెలిపిరి.

ఇండియా వైస్‌ప్రెసిడెంటు డా॥ రాధాకృష్ణన్, బొంబాయి గవర్నరు, మద్రాసు గవర్నరు, కేంద్ర హోంశాఖ మంత్రి శ్రీ బి. యన్. దాతర్, శ్రీ పి. టి. రాజన్‌గారలు ఉత్సవ సందర్భమున పంపిన సందేశములను సమాజం కార్యదర్శి శ్రీ V. C. శ్రీనివాసన్ చదివిరి.

శ్రీ చెంగల్వరాయ పిళ్లైగారు వందనసమర్పణము చేయుచు ఉత్సవము జయప్రదముగా జరుగుటకు తోడ్పడినవారికి – ముఖ్యంగా అధ్యక్షులు, ఉపన్యాసకులు, భక్తిగీతములు పాడిన శ్రీమతి కోమాటిల్ జానకి, ఫిడేలు, మృదంగముల వాయించిన శ్రీ రాజామణి, కుమారి జానకిగారలకు, విద్యుద్దీప అలంకరణ చేసిన వారికి కృతజ్ఞత తెలిపిరి.

తర్వాత స్వామీజీ విభూది, ప్రసాదములను పంచిపెట్టిరి.

---

## "గృహలక్ష్మి!"

శ్రీమతి S. K. నిరుపమగురుపల్

ఆదరించుము అన్నార్తుల
బేధమెంచక గుట్టుగాను
రట్టుచేయక నీ కాపురంబును
గుట్టుగ నడిపింపు వోగృహలక్ష్మి!

నీదు బిడ్డలు నాదు బిడ్డలను
వాదులాడగ వడ్డించు విస్తరిని
చూచి గుడిపె చల్లని తల్లివి
కాచి పెంచే ధరణి గృహలక్ష్మి.

నీదు నగవే నగలు, నాణ్యం,
నీదు మంచియె శాంతి, కాంతి,
నీదు ఓర్మి నీబిడ్డల బాట
నీదుమో సంసారసాగరంబున
ఓ గృహలక్ష్మి!

దిక్కులేక, గ్రుక్కలేక
పెక్కుమందిని కన్నతల్లివి
అక్కున నిడి పెంచిన తల్లివి
మక్కువగా మన ఓ గృహలక్ష్మి!

---

### ముఖచిత్రము

అమెరికన్ "డాన్సు జూబిలీ" బృందం భారతదేశం వచ్చి నవంబరులో మద్రాసు, హైదరాబాదు, బెంగుళూరు నగరాలలో ప్రదర్శన లివ్వనున్న నర్తకులలో ఆంద్రీ డెక్ మెన్, గార్మెన్ గ్యూటిరెజ్, కెరోల్ డి'ఆంద్రియా కూడా ఉన్నారు. ఈ బృందంలో మొత్తం 31మంది నర్తకులు, గాయకులు ఉంటారు.






**భాగవత కథ (శ్రీభాగవత దర్శనము) : శ్రీ 108 ప్రభుదత్త బ్రహ్మచారిగారు. అనువాదం – శ్రీరామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్య. ప్రకాశకులు – సాధన గ్రంథ మండలి, తెనాలి, గుంటూరు జిల్లా. వెల రు 2.50.**

సాధన గ్రంథమండలివారు శ్రీమద్భాగవతమును యింతకుముందు అయిదు ఖండములను ప్రచురించి యున్నారు. ఇది వష్ఠము ఖండము.

పవిత్ర గ్రంథమగు శ్రీమద్భాగవతమును సామాన్యప్రజలు పఠించి అందలి సారాంశమును గ్రహించుట సులభము కాదు. కాబట్టి అందలి భగవత్ లీలలను, కృష్ణపరమాత్ముని బోధనలను చిన్నచిన్నకథల రూపమున యావత్ప్రజానీకమున కందుబాటులోనికి వచ్చునట్లు ఒక్కొక్క ఖండముగా ప్రచురించ పూనుకొనిన సాధన గ్రంథమండలివారు స్తవనీయులు.

రచన, అనువాదము పొందికగాను, సమర్థముగాను సాగినది కాబట్టి యిందలి ప్రతియొక్క విషయము సర్వులకు సులభగ్రాహ్యముగా నున్నది. ప్రతియొక్కరు చదువతగిన అమూల్యగ్రంథము.

**యోగజీవన ప్రకాశిక : శ్రీ మహామండలేశ్వరస్వామి శివానంద సరస్వతీ మహారాజ్. అనువాదం – శ్రీ నందూరి వెంకటసుబ్బారావు. ప్రతులకు దివ్యజీవన సమాజము, శివానంద నగరము, ఋషీకేశము, డెహరాడూన్ జిల్లా చిరునామాకు గాని, శ్రీ నందూరి వెంకటసుబ్బారావు, దక్షిణ వీధి, ఏలూరు, ప॥ గోదావరి జిల్లా చిరునామాకుగాని వ్రాయవచ్చును. వెల రు. 2.25.**

ఇది ద్వితీయ భాగము. ఇందులో మానవులను దివ్యజీవనాన్ని ఉద్దేశించి శ్రీ స్వాములవారు అనేక బోధనలను, సూచనలను చేసి యిహపర సౌఖ్యాలకు మార్గమును చూపుచున్నారు. సాక్షాత్తు భగవత్స్వరూపులైన శ్రీ స్వాములవారు భక్తకోటికి మానసిక, శారీరక స్వస్థత నుద్దేశించి చేసిన వివరణలు అమూల్యములే కాక ప్రతియొక్కరు అనుసరించతగినవి. ఈ గ్రంథము ప్రతియొక్కరు చదివి సత్ఫలితములు పొందాలని ఆశిస్తున్నాము.

**శ్రీమత్ భగవద్గీతా మహాత్మ్యము : డాక్టరు పురాణపండ రామమూర్తి. ప్రచురణకర్తలు – అధ్యాత్మ ప్రచారక సంఘము, రాజమండ్రి. వెల 75 నయాపైసాలు.**

భగవద్గీత పవిత్రమైన, ఉత్కృష్టమైన గ్రంథమైనా దాని మహిమను గురించి తెలియనివారనేకులు గలరు. గ్రంథపారాయణమునకు ముందు దీని మహిమను సయితం తెలిసికొని సారాంశమును తెలిసికొనుటకు పుస్తకము ఉపకరించగలదు.

**వ్యాసశాకుంతలం : శ్రీ పురాణపండ రామమూర్తి. ప్రచురణ కర్తలు – అధ్యాత్మ ప్రచార సంఘము, ఆలమూరు, తూ. గోదావరి జిల్లా.**

రచన చాల మృదుమధుర శైలిలో సాగినది. ఇందులోని ప్రకరణలు శాకుంతలంలోని వాతావరణమును, పాత్రలను చక్కగా వివరించునవియై యున్నవి. పిన్నలు, పెద్దలు, సామాన్య ప్రజానీకము పఠించుట కనువుగా నున్నది.

# సంపాదకీయములు

## ఆంధ్ర ప్రదేశ్‌లో చేనేతపరిశ్రమ

చీరాలలో సహకారనూలు మిల్లుకు శంకుస్థాపనచేస్తూ ఆంధ్రలో చేనేతపరిశ్రమ ప్రాముఖ్యమును ప్రభుత్వము గుర్తించినదని ప్రధాని నెహ్రూ అన్నారు.

చీరాలలో స్థాపించిన నూలుమిల్లు నూలుకొరతనయితే తీర్చవచ్చును; కాని చేనేత ఎదుర్కొంటున్న సమస్యలు యింకా అనేకము కలవు. ధరవరలలో మిల్లుబట్టల పోటీనుండి రక్షణ కావాలి. నాణ్యం పట్ల, రకాలపట్ల నేయించేవారు, నేసేవారుకూడ శ్రద్ధాసక్తులు చూపాలి. నాణ్యంస్థాయి సన్నగిలితే మన దేశంలోనేకాక యితర దేశాలలో సయితము ప్రజలను ఆకర్షించజాలవు; ఆదరాభిమానములకు పాత్రము కాజాలవు.

నేడు చేనేత పరిశ్రమ ఎదుర్కొంటున్న సమస్యలలో ఉత్పత్తుల విడుదల సరళంగా లేకపోవడం ఒకటి. ఉత్పత్తులు ఎప్పటికప్పుడు విడుదల కవకాశములుంటే చేనేత పారిశ్రామికులకు చేతినిండా పని, దానికి తగిన ప్రతిఫలము అమరుతవి.

చేనేత పరిశ్రమకు చీరలు, పంచలు, తుండుగుడ్డలు, చేరుమాళ్లు ప్రత్యేకించుటవలన చేనేత పరిశ్రమకు రక్షణ, పారిశ్రామికులకు కొంత నిలకడైన ఆదాయము అమరగలవు.

## ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రధాని నెహ్రూ

ఆంధ్రప్రదేశ్‌లో పర్యటనకై వచ్చిన ప్రధాని నెహ్రూకు ప్రజలు యిచ్చిన స్వాగతం అఖండమైనది. అంతేకాక నెహ్రూ ప్రభుత్వ విధానాలకు ప్రజల అండదండలు కలవని రుజువయింది. పర్యటనలో పండిత నెహ్రూ దేశఆర్థికాభివృద్ధికి సాంకేతిక విద్యాసంస్థలు అవసరమనియు, వ్యవసాయంలోను, పరిశ్రమలలోను సహకారమార్గమే శ్రేష్టమనియు, గ్రామాల అభ్యుదయానికి సహకారమే మార్గమనియు, సహకార సామ్యవాదవ్యవస్థ ద్వారానే దారిద్ర్యనిర్మూలన సాధ్యమనియు, ఆంధ్రలో వ్యవసాయంతోబాటు పరిశ్రమలు సయితం అభివృద్ధి గాంచాలనియు ఉద్బోధించారు.

నెహ్రూప్రభుత్వ విధానాలు జాతీయాభ్యుదయాని కుద్దేశించబడినవనుటలో సందేహములేదు. నెహ్రూ నాయకత్వము మన కమూల్యమైనదే కాక జాతీయ, అంతర్జాతీయ రంగాలలో విశేష కీర్తిప్రతిష్టలను మనకు ఆర్జించిపెట్టుచున్నది. విజ్ఞాన పారిశ్రామికరంగాల అభివృద్ధికి సాంకేతిక విద్యాసంస్థలు అత్యవసరము. ఉమ్మడిశ్రేయస్సును ప్రోత్సహించి జాతీయసంపదను న్యాయంగా పంచగల సహకారవ్యవస్థ వ్యవసాయంలోను, పరిశ్రమలలోను బహుళోపయుక్తంగా నుండగలదు. దేశంలోని దారిద్ర్యమును అంతమొందించు సహకార సామ్యవాద మార్గముకంటె ఉత్తమమైనది మరొకటి లేదు. కలిమిలేముల మధ్యగల తారతమ్యము నశించి ఉమ్మడిగా ప్రజలు పరస్పరప్రేమ, సహకార సహాయములతో జీవితమునకు యిది శాంతియుతమార్గము. అయితే ఉమ్మడిశ్రేయస్సు లక్ష్యమైననే యీ సహకార సామ్యవాదమార్గము ఫలించును.

ఆంధ్రదేశంలో వ్యవసాయం అభివృద్ధిదశలోనున్నా పండితనెహ్రూ చెప్పినట్లు పరిశ్రమల యభివృద్ధికి సయితము అవకాశములు విస్తృతముకావాలి. ఉన్న అవకాశములను సద్వినియోగం చేసికొని వ్యవసాయంతోబాటు పారిశ్రామికంగా సయితము అభివృద్ధిగాంచడం ఆంధ్రదేశానికి అభ్యుదయసూచకము కాగలదు.

---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Ag. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వర వేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

8 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరు చేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భమును ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10    6 ఔ॥ రు. 5-50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్యశొంఠి

బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారీదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, వైద్యజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతానహీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్ - మైసూరులకు ఏజంట్లు:

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికింద్రాబాదు, బెంగుళూరు




# 57 ఏళ్లగా ఖ్యాతి గాంచినది.

లోధ్రలో హానికరమైన వేవీ లేవు. సుఖప్రదమైన జీవితానికి ఆరోగ్యాన్ని చేకూర్చడానికి అది గట్టి మందు. కెమిస్టు లందరి వద్ద దొరుకుతుంది.

లోధ్ర స్త్రీల దివ్యౌషధం

**కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.**
**రాయపేట - మదరాసు - 14.**









ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సాకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ & సికిందరాబాద్, బరంపురం